# రుక్మిణీ సందేశము



గ్రంథకర్త : బాలకవి మంచికంటి వేంకటేశ్వరరావు, అష్టావధాని.
గ్రంథభర్త : కోసూరు వేంకటపద్మనాభ చౌదరి.

శ్రీరస్తు.

# రుక్మిణీసందేశము.

ఇది

గుంటూరుజిల్లా, నర్సారావుపేట తాలూకా, సంతగుడిపాడు వాస్తవ్యులగు

బాలకవి, అష్టావధాని

మంచికంటి వేంకటేశ్వరరావుచే

రచియింపబడి

అబ్బరాజు సీతారామశర్మగారి వలన

పరిష్కరింపబడి

కోనూరు వేంకట పద్మనాభచౌదరిగారి

ద్రవ్యసహాయమున

బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి ప్రకటింపబడియె.

1928

 [వెల రు 1-0-0.

# ఇందలి పాత్రలు.



కృష్ణుడు—కథానాయకుడు

బలరాముడు— కృష్ణుని యన్న

రుక్మి—రుక్మిణి యన్న

భీష్మకుడు—రుక్మిణి తండ్రి

అగ్నిద్యోతనుడు—బ్రాహ్మణుడు

శిశుపాలుడు—పెండ్లికొడుకు

దంతవక్త్రుడు—శిశుపాలుని తమ్ముడు

జరాసంధుడు

శంకరుడు

కమల—రుక్మిణి తల్లి

రుక్మిణి—కథానాయకి

సరోజిని—రుక్మిణియొక్క దాసి

శ్రీరస్తు.

# ఉపోద్ఘాతము



పాఠకమహాశయులారా !

ప్రపంచమునందలి మానవుల హృదయములు నానాటికి మారుచున్నవి. ప్రస్తుతము నవలాలోకము నాటకలోకము జరుగుచున్నది. సామాన్యముగా నాట్యరంగములులేని గ్రామంబులరుదు. వారు ప్రదర్శించు నాటకంబులలో జాలవరకు నీతిబద్ధములు, కొన్ని నీతి బాహ్యంబులుగా గన్పట్టుచున్నవి. కావున లోకము మహోన్నతదశకు రాదగువానిని బ్రదర్శించుటకు యత్నింపగోరుదురుగాక, రుక్మిణీసందేశమను దృశ్యకావ్యకర్త మంచికంటి వేంకటేశ్వరరావుగారు. వీరిది నర్సారావుపేట తాలూకా సంతగుడిపాడు గ్రామము, కాశ్యపసగోత్రము ఆపస్తంబసూత్రము తల్లి కోటమ్మ, తండ్రి నరసయ్యగారు, వీరివంశమందు చిరకాలమునుండి కవిత్వము చెప్పగలవారు కలరు. "వెసనన్ను లక్షణ వేత్తగావించిన, ఘను మంచికంటి రాఘవకవీంద్రు" అని తన గురువర్యునినప్పకవిగారు నుతించినారు. ఇంకను వీరి వంశమందు పేరుపొందిన కవులు పాపయ్యగారు రామకృష్ణయ్యగారు, వీరనారాయణ ముకుందముగారు, రామకృష్ణయ్యగారి కుమారులు పాపయ్య, వెంకటనరసయ్యగార్లు. వీరిద్దరిలో పాపయ్యగారు ఏలూరు జమీందారుగారగు మంత్రిప్రగడ భుజంగరావుగారి కుమార్తె వివాహకాలమందు తన చరిత్రమును వ్రాసివారికిచ్చియున్నారు. వీరు చాలావత్సరములు సర్వేయిలాకా డిప్యూటిసర్వేయరుగా పనిచేసిరి. ఈ బాలకవి వేంకటేశ్వరరావు 1908 సంవత్సరమున జన్మించిరి. వీరనేక గ్రామములందు అష్టావధానము లొనరించి మెడల్సునందిరి. "జయప్రద" నాటకంబును, అంబరీషోపాఖ్యానము హరికధనుకూడ రచించిరి. ఇప్పటికి వీరి వయస్సు 20 సంవత్సరములు, వీరు తమగ్రామములో శ్రీరామకృష్ణ

విలాసమను నాటకసమాజ మొకదాని నేర్పాటుగావించిరి. దాని యందైదారు సంవత్సరములనుండి పరిశ్రమచేయుచు నీ రుక్మిణీసందేశమును రచించినారుగనుక ప్రదర్శించుట కెంతయు దగియున్నదను టతిశయోక్తి కాదు. వీరికవిత్వము మృదువై మాధుర్యమై ముద్దులుమూటలుగట్టుచు నవరసభరితముగా నుండును. ఇది భాగవతమునందలి ప్రసిద్ధమగు చరిత్రమైనను కవి స్వతంత్రించి శ్రీకృష్ణుకు లీలామానుష విగ్రహుండగుటచే రుక్మిణీదేవి మనోరథంబుసాగింప గౌరీపూజకు పోవు లోపలనే రుక్మిణీదేవికి శ్రీకృష్ణుడు సాక్షాత్కరించినట్లును వారిహావభావ విలాసములు గనంబరచిరి. ఇందు శృంగారరసమును బోషించిరి. శ్రీకృష్ణజరాసంధాది యోధానుయోధుల సంగరరంగ ప్రవీణత బాగుగా గనబరచిరి. ఈ నాటకరత్నంబును ప్రదర్శించినందున సంతసించి శ్రీరామకృష్ణవిలాస నాటకమానేజరు మహారాజరాజశ్రీ కోసూరి పద్మనాభచౌదరిగారు ముద్రింపించెదనని వాగ్దత్తముచేసి కవిగారికి ప్రోత్సాహము కలిగించిరి. ఈ బాలకవి సద్గ్రంథములు మఱికొన్ని రచించి జగదుపకారమొనర్తురుగాక! ఇన్నాటకమును ముద్రింపించి తన యశోలతను దేశంబులందల్లుకొనజేసిన పద్మనాభచౌదరిగారి కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి గలుగజేసి నిరంతరము పరమేశ్వరుండు రక్షించుగాక, సర్వదా ప్రజలు పారమార్థిక చేతస్కులౌదురుగాక.

నర్సారావుపేట తాలూకా
ఆకపల్లి అగ్రహారం.
2—1—1928

ఇట్లు
బుధజనవిధేయుడు,
అబ్బరాజు సీతారామశర్మ,
పరశురామ చరిత్రాద్యనేకాంధ్రగ్రంథకర్త.

శ్రీరస్తు.

# కృతిపతివంశానుక్రమణిక

చ. శిరమున బర్హిబర్హములు శ్రీవనితామణి వక్షమందునన్
గరముల శంఖచక్రములు కంఠమునం దులసీసరాలు క
స్తురితిలకంబు మోమున, విశుద్ధమనంబున వంశనాళసు
స్వరమున నోలలాడెడి ప్రశాంతుడు బ్రోచుత పద్మనాభయ్యన్॥

తే॥ గర్త్తపురిమండలమ్మున గలదు శాత్ర
వులకజేయంబునయి సంపదలకు నిర్వ్యా
తంబునై పదవిష్ణుమార్గచుంబితవర
ణంబునై సంతగుడిపాట్పురంబు వెలయు॥

తే॥ ఆపురిని నాల్గువర్ణంబు లందు ధీర
చరితు లుత్తమపురుషులు సాంద్రకీర్తి
వంతు లంగజరూపకుల్ ప్రథితకళల
గ్రాలుచుందు రజేయులై కమ్మవారు॥

సీ॥ డిండీర నీహార పుండరీకసమానసుయశోవనధులు కోసూరివారు
సంస్కృతాంధ్రాదిలసద్వాగ్విరీసువిశారదామణులు కోసూరివారు
పరిపంథినికురుంబ ప్రథితదోర్గర్వవిదారులౌ వారు కోసూరివారు
సుకవీంద్రవందిత ప్రకరసంస్తవనీయ మారమూర్తులరు కోసూరివారు
బౌద్ధపాషండజైన దుర్వాదవితత
వారిద ప్రభంజనలరు కోసూరివారు
అట్టి కోసూరివారిలో ననఘచరితు
డై మెలంగెను శ్రీయక్కయార్యుండు॥

తే॥ చంద్రచూడుండు పేర్మిని శైలసుతను
గొనినవగిదిని హితబంధుకోటి యెన్న
యక్కయాఖ్యుడు పేరమ్మ యనెడిసతిని
పరిణయంబాడె మదియందు ప్రమదమెసగ॥

# రుక్మిణీసందేశము.

క॥ ఘనమతులగువారిరువుర
కను జనియించిరి మహాత్మకులు సుబ్బయ నా
గను తాతయనా శేషయ
యనబరగిరి యధికసత్కళాఢ్యవిభవులై॥

క॥ తాతయ్యయచ్చమాంగిక
జేతోముదమునవరించి చెలగికొమరులన్
ఖ్యాతలమునబడయమికై
కాతరవహించియించిగడపె కడదివసంబుల్॥

తే॥ అతనితమ్ముడు శేషయ్య యచ్చమాంబ
యనెడికాంతను బెండ్లాడియామెవలన
నవని సీతమాదెమ వీరయాఖ్యుల మరి
రామకృష్ణాఖ్యయలను మాలక్ష్మిని గనె॥

వ॥ అందు రామకృష్ణుడు.

క॥ కనుగొనడు పరులకాంతల
గనినంతనె తల్లులుగను గనుగొనునెమ్మల్
వినడు దయార్ద్రమనంబున
గనుగొని ప్రాణులసతంబుగాచున్ ప్రేమన్॥

చ॥ ఖలులనడంచి సజ్జనులగావగ ద్వాపరమందు రామకృ
ష్ణులనగ రెండురూపముల సోమకదైత్యవిదారితోచె నీ
కలియుగమందు దుర్మతవిఖండనజేయగ రెండురూపముల్
గలసిజనించెనోయనగ గ్రాలె సుధీమణి రామకృష్ణుడున్॥

వ. మరియు

క॥ సారాచారుడు వైరివి
దారుడు సుకలాన్వితుండు దాంతుడుశాంతుం
డారాఘవపదభక్తుడు
కీర్తికాకరుడు రామకృష్ణుడెచూడన్॥

తే॥ తాతయాఖ్యుడు తనకుపుత్రకులులేమి
రామకృష్ణునిదత్తపుత్రకునిగా గ

హించిపెంచెను కృష్ణునినింపుపెంపు
జెందపోషించిమించిన నందునివలె॥

సీ॥ కోసూరి సద్వంశకూపారమునకును మృగధారియయ్యి జన్మించినాడు
అంతట దేవభాషాంధ్రహూణాదులో బహుభాషలగడించి బరగినాడు
తరువాత మిత్రబృందంబులు మేలన చెలగిముక్తసభ్యపని చేసినాడు
సద్దేశికునిసేవ సలిపిదయంబొంది యావరంజ్యోతినినరసినాడు
శిష్యసమితికి సద్బోధజేసినాడు
లలితశ్రీముక్తికాంతాలలామ సంగ
మజనితామోద తుష్టితమానసుండు
అతడురామకృష్ణుండు మహాత్మకుండు॥

క॥ ఆతడుపిచ్చమయనియెడి
నాతినివరియించి బుధజనంబులువొగడఁ
చేతోద్భవుడచ్చెరువడ
ధాతాంగనకరుణపాత్రుతాతయనుగనెఁ॥

సీ॥ పిచ్చమ్మయుండగా పిమ్మట వెంకమ్మయనుసుదతిని వివాహంబునాడి
, అందువెంకయనచ్చమాంబవేంకటసుబ్బయాఖ్యశేషయ్యసుబ్బమ్మనుమరి
పావనిమహాలక్ష్మి పద్మనాభయచెన్నయాఖ్యులగనియె విద్యాధికులను
జననీజనకుల స్వచ్ఛంపు భక్తినిగొల్చుచుందురు వారలానందగరిమ
బలులు ధీరు లుదారులు ప్రణవమంత్ర
పఠనసంజనితోత్సవ భావులు గత
రిపులు కార్యాధురంధరు ల్నిపుణమతులు
వారికేవారు సాటి యెవ్వారులేరు॥

సీ॥ తాతయ్యచౌదరి తగనీశ్వరమను మాలక్ష్మితరుణుల నిల్లాండ్రగగొన
వేంకయ్యచౌదరి వేడుకమీర కళత్రంబుగాను చెల్లమనుగొనియె
సరవిగా శ్రీపాపసాని నర్సయచౌద రీంద్రున కచ్చమనిడిరి సతిగ
వేంకటసుబ్బయ్యవిదితయశోనిధియచ్చమాంబికను జాయగనుగొనియె
ప్రేమశేషయ్య లచ్చమాంబికనుగొనియె
యువని శ్రీ గార్లపాటి నాగయ్యకిడిరి

భార్యగా మహాలక్ష్మని బంధుమిత్ర
సంఘములు మేలు భళిరె హైసరె యనంగ॥
తే॥ రామచంద్రుండు జానకీ రామను మది
ప్రమద మెసగంగ గైకొన్నవగిది పద్మ
నాభచౌదరి గ్రహియించె నాగరత్న
మనెడి సాధ్విని పండితజనులు పొగడ॥
క॥ అలచెన్నయ చౌదరిమణి
తులసియనెడి తరుణికేలు తోషము మదిలో
పల గలుగవట్టె శచినిం
పలువలజవరాలిమరది కైకొనినటులన్॥

వ॥ ఇట్లు వీరివంశము సిరిసంపదలతో దులతూగుచుండు॥
క॥ ఘనవిక్రమక్రమాన్వితు
డనఘాత్ముం డిద్ధయశు డహస్కర తేజుం
డనుపమ సుకళానిధి స
జ్జనవినుతుడు పద్మనాభచౌదరి యొప్పున్॥
క॥ పలుకడు మృషవాక్యంబుల
తలపడు మిత్రులనుజెరుప తాలిమివిడ డే
కలియుగ రాధేయుం డు
జ్జ్వలగాత్రుడు పద్మనాభచవుదరి ధాత్రిన్॥
చ॥ సరసుడు ధీరు డర్థిజనజాల సురద్రుమము దుజ్జ్వలాంగు డ
త్యురుకరుణాబ్ధి నిక్కవటి యోషిత పుష్పశరాసనుండు శం
కరసురగాంగ కల్పతరు కర్పురహీర సమానసద్యశో
భరితుడు పద్మనాభ నృపవర్యుడు దాంతుడు శాంతు డీధరన్॥

వ॥ ఒక్క సుదినంబున శ్రీయుత పద్మనాభచౌద రీంద్రుం డతులితా మోద
స్థితాంతఃకరణుండై నన్ను జూచి సాదరంబున॥
తే॥ సప్త సంతానములను ప్రశస్తిగాంచి
యలరుసది కావ్యమని పెద్దలందు రందు

దృశ్యకావ్యంబు శ్రేష్ఠంబు ధీర! వ్రాయు
మని వచించగ నేనిటు లంటి నపుడు॥

తే॥ అన్న రుక్మిణీపరిణయ మనెడి కథను
నాటకంబుగ వ్రాసియున్నాడ గాన
దాని భరియింపుమనగ నాదానశాలి
యధికముదమంది వల్లెయటంచు బలికె॥

తే॥ కనుక సద్గుణనికురుంబ వనధికి గత
దురితునకు జితమరునకు గరుడగమన
భక్తునకు నలకోసూరి పద్మనాభ
చౌదరికి సంకితముగ పుస్తకమునిడుదు॥

తే॥ దాంతునకు ధీరునకును వేదాంతునకు వి
నిర్మలాంతఃకరణునకు నిపుణమతికి
నాగరత్నాంబధవున కనఘవ్రతిప
దాన్యునకు పద్మనాభచౌదరి నృపునకు॥

---

శ్రీ ర స్తు.

# రుక్మిణీ సందేశము.

## నాంది.



ఉ॥ శ్రీవసజోదరుండు యదుసింహుడు దాసజనానుకూల స
ద్భావు డరాతిమర్దనుడు పాండవదూత దయామయుండు దీ
నావను డార్యవందితు డహస్కరతేజుడు శౌరి రుక్మిణీ
దేవివిభుండు సభ్యుల నుదీర్ణకృపన్ గరుణించుగావుతన్॥

సూ—(ప్రవేశించి యాతురతతో) సతీ! సతీ! (అనిపిల్చును)

నటి—(ప్రవేశించి) ఏమట్లు గొంతుబొంగురుబోవునట్లు కేక లేసెదవు. చీర సింగారించుకొని రావద్దు!... ఇంతలోనే యింతయాతురతయా!

సూ—నా ఆతురతకేమిలెమ్ము. ఈజనవేడుక యీజనసమూహము యీ జనుల కలకలము చూడుము. వారికిప్పుడున్న యాతురతకంటె నాతొందర లెక్కుడైనదా! కాదు. కాని దీనికికారణమేమి?

నటి—కారణమా నేడు రుక్మిణీసందేశ నాటకప్రదర్శనముగదా!

సూ—అవునుకాబోలు. (ఆలోచించి) కాంతా! యీనాటకమునకు కర్తలెవరో

నటి—శ్రీయుత బాలకవి మంచికంటి వేంకటేశ్వరరావు.

సూ—ఓహో! తెలిసినది.

తే॥ అవని శ్రీ మంచికంటి వంశాబ్ధివిధుడు
మహితవిబుధుండు నరసయామాత్యసుతుడు
అబ్బరాజు సీతారామయకవి శిష్యు
డీశ్వరీసేవకుడు వేంకటేశ్వరకవి॥

ఆహా! విశ్వమోహినీ పదధ్యానాసక్తుడగు, నీతనివాగ్ఝరికడ్డేమి! ఈతని మృదుమధురకవిత యెల్లలోకంబుల నరనిముసంబులో సంతోషసాగర

ములో నోలలాడించుననుటకు వింతయేమియు లేదు. కావున నీనాటకముజూడవలసినదే!

నటి—నాథా! కృతిభర్తనామమువింటిరా?

సూ—ఏది యాపవిత్రనామము నాకర్ణరంధ్రముల బడవైచి పుణ్యము గట్టుకొనుము.

నటి—శ్రీయుత, కోసూరి వేంకటపద్మనాభ చౌదరీంద్రుడు.

సూత్ర—ఆహా, ధన్యోస్మి. వీరుగూడ భారతదేశమునకు చిరపరచితులే, చూడు

సీ॥ పిరారులనుద్రుంప వెనక్కంజనిడడు దీనజనులజంప వెనక్కంజనికును
ఆలింపజనడు దురాలోచనల, నాలకింపగోరును విష్ణుకీర్తనలను,
చేయగాబోవ డన్యాయంపుకార్యముల్ చెలగివ్రతాదుల జేయునెంచు
భావింపడెవ్వాని పగవానిగా చిన్నపెద్దల హితులని ప్రేమదలచు
అరయనాతడు నాగరత్నాంబహృదయ
కమలకమలాప్తు డరిజనగజగజారి
బంధుపాత్రుండు కోసూరి పద్మనాభ
చౌదరీంద్రుండు విమలవిస్తారయశుడు॥

ప్రేయసీ! బాలకవి నాటకమనిన జనులకెంత ప్రమోదమో చూడుము. ఇంతకీ కవియొక్క జగదీశ్వరియందలి నమ్మకమే కారణము. (ఒకవైపుచూచి) అదిగో—నాచేతివైపుచూడుము. జనులు క్రిక్కిరిసి చంద్రునికై యెదురుచూచు చకోరములరీతి పాత్రలకై నిరీక్షించుచున్నారు. గావున మనము త్వరితముగజని యీ నాటకప్రదర్శన ప్రారంభ మొనరించుదము రమ్ము.

(ఇద్దరు నిష్క్రమింతురు)

---

శ్రీరస్తు.

# రుక్మిణీసందేశము.

## ప్రథమాంకము.

—* ప్రథమరంగము. *—

తెరయెత్తబడగా.

ఆసనాసీనులై రుక్మి - భీష్మకుడు - కమల ప్రవేశింతురు.

భీష్మ—కుమారా! నీ ముద్దుచెల్లెలగు రుక్మిణి

తే॥ దేవకీదేవికిని వసుదేవులకును
ముద్దుకొడుకయి ద్వారకాపురముకాపు
రంబుగానుండి చాలయశంబుగాంచి
నట్టి శ్రీకృష్ణువరియించె నాత్మయందు॥

కమల—రుక్మిణి వరించుటయేగాక - మీతండ్రిగారును నేనునుగూడ నందుల కిష్టపడితిమి.

రుక్మి—తండ్రీ! అటులిచ్చుట వీలుపడదు. చూడు. (తిరస్కారముగా)

చ॥ తినుటకులేక పొట్టకయి దీనతతో నలపాండవేయులం
గని పలుమాయమాట లతిగాఢముగా మరి నమ్మునట్లుగా
ననయముజేసి సక్కవినయంబులు నెన్నియొ జూపిజెప్పిజీ
వన మొనరించు నీచునకు బాపురె రుక్మిణి నీయుటొప్పునే॥

భీష్మ—శరణాగత వత్సల బిరుదాంకితుడగు కృష్ణుడురాజుగాని, తక్కిన వారందరొక రాజులేనా? (పరిహాసముగా) అవును. నీమాటనిజము వీరందరు రాజులకుబదులు తరాజులుకావలెను.

రుక్మి—ఏమీ వాడధికుండును, తక్కినభూపులధములా! "పెద్దతనము వచ్చు బుద్ధి పెడతలబట్టె" అన్నట్లు పెద్దతనముచేత నీకు మతి తప్పి యిట్లనుపించుచున్నది. ఓ తలిదండ్రులారా! వినుడు.

ఉ॥ గొల్లవడంతులక్కవలచి కూరిమి బిల్లనగ్రోవి బాడుచుక్
నల్లని తెల్లపూసల ఘనంబగు సొమ్ములుగాగ మీనసం
ధిల్లగజేసి వన్యముల ద్రిమ్మరిగా నడయాడు చుండు నా
గొల్లకు హేమగాత్రియగు గోలనొసంగుట మీకు పాడియే॥

కమల—కుమారా! రుక్మీ! అమ్మహాత్ముని గేలి సేయునంతటివాడవా? నీవంటి మూఢశిరోమణులెందరయిన నాపూతచారిత్రుగోపాలుని పోలుదురా—చూడు.

తే॥ బలముగలవాడు దీనులపాలివాడు
తమ్మునను గేలిసేయునేత్రములవాడు
కడువిశాలముగల్గు వక్షంబువాడు
కీర్తి కాంతాయుతుండు రుక్మిణికి జోడు॥

రుక్మి—(అదరిపాటుతో లేచి, కోపముతో) ఏమీ మీకిట్టిపాట్లు గలిగె. ఉత్తమ వంశజాతను, నీచజాతుండగు యాదవునకొసంగుదమని పల్కుచున్నారు. ఇప్పుడు మీరు వృద్ధులైయున్నారు. గనుక మీమాటలు నాకునచ్చవు. నాయిష్టమున కెదురాడకుడు, బాల్యమునుండి పెంచి పెద్దజేసిన తలిదండ్రులని కొంచెమునాలో చించితిగాని, మరొకడైనచో మట్టుబెట్టెడివాడనే. పెద్దవారలు పిన్నవాండ్రకు నీతి గఱపుటకు మారుగా హీనుని పెండ్లాడుమనియూ చెప్పదగినది. మహారాజాధిరాజులై యవక్రపరాక్రమ విక్రమవంతులై, చతుష్షష్టికళాధురీణులై యలరారు శిశుపాలదంతవక్త్రులు లేరా, యిందరు ధరాధిపతులుండగనే మీకీపందకనిపించెనా, మీమాటలాలించినది మొదలు మదీయహృదయము దగ్ధమగుచున్నది. ఇక మీరిటుల నాకతికి మించినచో నిదే మిమ్ము నావాడిఖడ్గమునకు బలిగానొసంగి మాచెల్లిని యుత్తమక్షత్రియునకొసంగి, పాణిగ్రహణముగావించి, బంధుజనంబులచే మన్ననల గాంచెద.

భీష్మ—కుమారా! ఎంతవాడవైతివి. నీవనినది నెరవేర్చిన మహాసంతో

మము. జననీజనకుల జంపుటయేగదా! నీవంటి నికృష్టులకు పరమ ధర్మము.

కమల—క. నవమాసంబులు మోసియు
భువినినుఁగని ప్రేమబెంచి భూపతి జేయఁ
జవమున జంపెదనని కను
గవనిచ్చితె తుదకు నిట్టి కాలమువచ్చెఁ॥

రుక్మి—అవునుగాని మీమాటలు నామఁందు సాగవు. వినినంతవరకేమొ వినినాను కాని, యికవినను. వందయగు వాసుదేవుండెక్కడ? రుక్మియెక్కడ? సంబంధమెక్కడ, వినుము. (పరిహాసముతో)

చ॥ ఇరువదియొక్కమారు ధరణీంద్రుని దాడికినిల్వలేక సో
దరసహితంబుగా త్రికకుదంబుననెక్కియు ప్రాణవాయువుల్
పరమభయాన గాచికొన ద్వారకసంద్రములోన గట్టియుం
బరగెడి, యాదవాధముని పాలొనరింతురె నాదుచెల్లినిఁ॥

కమల—ఎవరా ధరణీంద్రుడు జరాసంధుడేగదా!—ఔను. యీతండు కృష్ణునిచే పదియేడుమారు లపజయంబంది తన పురంబునకరిగి, తిరిగి పదాతుల గూర్చుకొని పదియెనిమిదవసారి దండెత్తి నప్పుడు జయంబు లభించినది. ఇంతయేల! జయాపజయంబులు దైవాధీనంబులుగదా:—కృష్ణుడు వందయెట్లగు? పదియేడుసారులు పాటిన జరాసంధుం డేల పిరికికాకపోవును. నీ వా జరాసంధుని వంటివాడవేగాక యతనికంటె పదిరెట్లు నీచుడవు... దుష్టుడవు.

భీష్మ—కుమారా! ఎన్నిజెప్పిన వినక బంధువులకు తలిదండ్రులకు పగద లంచితివా? నీమాట కెన్నడైన బదులుచెప్పితిమా? నేడెందుల కో మా హృదయము, కృష్ణున కీయవలెననియే పోవుచున్నది. ఇంతగా బ్రతిమాలి జెప్పిన తల్లిదండ్రులమాటల విశ్వసింపకూడదా? తానుబట్టిన కుందేలునకు మూడేకాళ్ళన్నట్లు నీవు పట్టినపట్టు విడువకుంటివేమి? నీమూర్ఖము చూచిన మాకు దివులు నీర్ష్యలు గల్గుచున్నవి. పరివారు వినిన నగుదురనియైన తలంచవేమి! ఇంతకు నెవరికీయవలయునని నీయూహ?

రుక్మి—(కోపముతో) జనకా! కాదు కాదు. శత్రుసమానా! నావగతుం డగు చక్రినిబొగడుచు నన్నుహీనునిగా నెంచుచుంటివి. రాజరాజకోటీరమణి మంజరిపింజరిత పాదాంభోజయుగళుండనగు నాకా యధముడు సరిపోలునా ? నాముద్దు చెల్లిని శిశుపాలునకు దప్ప నెవరి కీయదలంచుకొనలేదు. మీకిష్ట ముండిన కళ్యాణము జూచి యానందింపుడు, లేనిచో—జీవంబులవదలుడు.

(నిష్క్రమణ.)

భీష్మ—అయ్యోపాపిదైవమా! ఈమూఢుని నీ జనకద్రోహిని ఈ కృతఘ్నుని నాకేల సుతునిగా జేసితివి, చేసితివిపో,—పుట్టినప్పుడే గిట్టింపకపోయితివా ? లేనిచో—మంచిబుద్ధియైన నొసగకపోయితివి. కటకటా! రుక్మిణిని శిశుపాలున కీయదలంచెనట! వాడింత కంటె కిరాతకుడు (ఆలోచించి) చింతయేల!

తే॥ ఘూకములకును శశికాంతి గూడనట్లు
రాముకథ దుష్టునకు నెక్కరానియట్లు
దయ యనెడిమాట దొంగకు దగనియట్లు
ఇపుడు నానుడు లీతని కేవ్యామయ్యె॥
అవును సందేహమేమి?

సీ॥ అనవరతంబు సర్వాబద్ధములనాడుట కళంకపుమది తానకమునతము
తల్లిదండ్రులమాట నుల్లంఘనము జేయు, పాపపువనులు స్వాభావికములు
కుజనాళులంగాచి సుజనసంఘంబుల వేదనపాల్సేయ బిమగుతునక
సచ్ఛాస్త్రములనెల్లజదువడుగాని దురాలోచనలకు సిద్ధాంతవేత్త
పరవధూమణులనుబట్ట బ్రహ్మకాయు
అరిజనములదిట్ట సహస్రముఖుడు
పేకయాటలనాడ తుపాకిరవ్వ
మంచిగుణమెన్నగనరాదు మచ్చునకును॥

కమల—నాథా దిగులొందకుము.

ఉ॥ పిన్నటనాటనుండి యతిప్రేమచెలంగగ బెంచిపెంచి వి
ద్యోన్నత పెద్దజేసియు వివాహమొనర్చి బదంబొసంగినట

గన్నను తుండు నేడు వడి కన్గవ నెట్టగజేసి కారులె
న్నెన్నియొ గూర్పెగా కితరు లేయని గారవమూనకీగతిన్॥

ఆలోచించ నేల వాని యిష్టము వచ్చినతావున నీయనిండు. ఎదురాడకుడు. ఎదురాడిన బ్రాణముల కోల్పోవలయును. చంపెదనని వాడు చంపక మాత్రము విడుచునా—చంపిన నెవరు రెవ్వరు? మనము వార్ధక్యములోనున్నాము. వాడు పడుచుతనములోనుండెను. కనుక వాడు జెప్పినట్లే యొప్పుకొని శిశుపాలునకే యివ్వనిండు. సర్వమునకు సర్వేశ్వరుని దే భారము. మన శయనగృహముకడ కేగి విశ్రాంతి దీర్చుకొందము రండు. (ఇద్దరు నిష్క్ర.)

## 2 వ రంగము.

### విలాసగృహము-రుక్మిణిప్రవేశము.

రుక్మిణి—(విరహముతో) అహా దేవకీనందనా!

ఉ॥ నీదుముఖాంబుజంబురుచి నీదగు బాహుబలాఢ్యసంపదల్
నీదుశరీరకాంతి నళినీదళలోచన నీ ప్రతాపముల్
నీదుకళాకలాపమును నీదగు పెన్నెరులంద చందముల్
నీదుమహాత్వముల్ వినియు నే నినుగోరితి రా యశోదజా॥

అక్కటా! మదనుడు నిశితాశుగంబుల నన్నువదలక మదిబెదరవదలుచున్నాడు. వాసుదేవుడా— ద్వారకయందుండె. నేనా విదర్భయందుంటిని. మా యిరువురికి సంబంధమెట్లు? కృష్ణుని పెండ్లియాడుటకు నాతల్లిదండ్రులు తక్కిన బంధువులంద రొప్పుకొనిరిగాని దుర్మార్గుండగు మాయన్న రుక్మి యొప్పుకొనడయ్యె (నిదానించి) అబ్బా! యీ విరహతాపమునుండి నన్ను రక్షించువారెవ్వరు! ద్వారకాపురికేజని కృష్ణుని వరింపుమందునా! (ఆలోచించి) ఛీ నేనెటులబోవుదు. ఒకవేళ పోయి అడిగిన నాతడు నిరసించిన నాకు దిక్కేది (కొంచెమాగి) కృష్ణా!

ఉ॥ కన్నులనిద్ర లేదు తినగా రుచియింపదు కూడు చూడనే
తెన్నునగానుపించును సుధీమణి నీదగు దివ్యమూర్తి వి
ద్వన్నుత మన్మథాశుగ విదారితదేహను బేల నిట్టులా
పన్నత నొందుచుంటి నిక పాణిగ్రహింపు గ్రహింపు వల్లభా॥

హా యదుసింహకిశోరా! నాగతియు నాదైవము నాపతియు నాయానందము నాప్రాణమునీవేయని మనోనిశ్చలముతో ప్రేమించుచుంటిని. నాయందనాదరణజూపకు; చూపినచో నేనుజీవింపను; రమాదేవియు విప్రకన్యమొదలుగాగల సాధ్వీమణులనేకమంది నిన్నుపతిగా గోరి ప్రార్థించిన వారి ప్రొముక్కలగొని సతులుగా గ్రహింపవె. వారలలో నేనొకర్తెనని దయయుంచి మొరాలించి గ్రహించుము.

మఱియు.

సీ॥ భక్తమందార నీవదన పంకజమును గనక జగముగాంచు కన్నులేల
మన్మథాకార నీ మహిమలగొనియాడకయె మను సుదతివక్త్రంబదేల
కాంచనచేల నిం గౌగలిజేర్చని తరుణివా కడుమృదుకరములేల
కాయజజనక నిం గలియకయుండెడి కాంతదాపేశల కాయమేల
కనుకనింగోరియుంటి దుర్గర్వమారు
డదయుడై వేగశరములబడనుజేసి
వేయుచున్నాడు జాగేల బింకమేల
నన్నుగౌగిటనుంపరా నళిననేత్ర॥

అయ్యోదైవమా! నన్నెప్పుడు కోరికలదీర్చి సంతోషబెట్టెదవు?

(కోపముతో) మారా!

చ॥ సిరికొమరుండనంచు ఘనశీలము గల్గెనటంచు భృత్యులెం
దరొగలరంచు కీరములు తాళిమివెంట నటించునంచు సుం
దరుడనటంచు కోలలనెదఁ వడియేసెద వోరి క్రూర! నా
వరునిసహాయమున్నయెడ పారగదోలనె మీనకేతనా॥

మరియు,

తే॥ శివుని నేత్రాగ్ని చేత జచ్చియును బ్రతికి
సిగ్గువిడనాడి విరహిణీశ్రేణిమీద
మగతనంబును జూపెదే! మార్గ్యమేల
చాలుచాలిక పోపొమ్ము సాగసాస్త్ర॥

(దుఃఖముతో) అన్నా! అన్నా! నీచెల్లెలియందుదయయుంచి వాసుదేవునికీయరాదా! నన్నుకఠినాత్ముడు నాకులద్రోహుడు నా కయిష్టం

డగు శిశుపాలునకేల నంటగట్టజూచెదవు? తోబుట్టువుల నిట్టు లేడ్పించిన నీకేమి ఘనము! వరించినవానికిచ్చి చేయుట మనకులధర్మమేగదా! ధర్మవిరుద్ధముగాదుగదా! మంచిసంగతియని జెప్పిన తల్లిదండ్రులమాటల కెదురాడి వారినిగూడ కొట్టబోవుటయా! ఏమీ నీమౌర్ఖ్యము! (అటునిటుచూచి) అదుగో! మహానుభావునకు దయవచ్చినట్లున్నది లేనిచో యీ సంతాపములో సంతోషమేమిటి! ఇవిగో! పులకాంకురములు. ఇవిగో హర్షాశ్రువులు. ప్రాణేశా! మదీయ సర్వేంద్రియములు నీరూపుజూచుటకు యత్నించుచున్నవి. హృదయమా-ఆలోచనలచే నీర్ష్యగాంచెను. దృక్కులా-నీవంకకుదిరిగెను. కరములా! నీఆలింగన సుఖమనుభవించ ప్రయత్నించెను. పాదములా-తడబడెను. ముఖమా-వాడిపోయెను. కురులా-దువ్వుటలేమి చిక్కులువడియెను. కర్ణములా- నీమృదుమధుర భాషలు వినవలెనని కసిపెట్టుకొనియున్నవి. శరీరముజిక్కెను. డగ్గుత్తిక పడియెను. ఇంతయేల జీవచ్ఛవంబునై నీదర్శనంబుకొరకు బొందిలో ప్రాణములనిల్పుకొంటిని. దీనురాలనగు నన్నుభరించి సౌఖ్యములగనుము. మొరవినుము. హా కృష్ణా! (కరములుమోడ్చి)

సీ॥ సర్వజగన్నాథ సర్వేశ గోవింద వసుదేవనందన వందనంబు
పరమేశశాశ్వతామరనుతాంఘ్రిద్వయా వామన నళినాక్ష వందనంబు
నీ హార దేవతా వాహినీ డిండీర భవ్యయశోనిధీ వందనంబు
యదువీర! సూర్యచంద్రాక్ష! క్షమాధీశ పరమాత్మ వైకుంఠ వందనంబు
దీనజనబాంధవా! మహాదేవవినుత
పాదపంకజయుగళ! పాపహరధీర
నీరజదళాయతాక్ష వినీలదేహ
పావురలినిక్రోలితి పద్మనేత్ర॥

ఓదయానిధీ నీ మాయలదెలిసికొనుటకు బ్రహ్మాదులకు వశమా? ఇక మానవకాంతనగు నేనొక లెక్కయా? నీవు నన్ను ప్రేమించెదవు నన్ను తప్పక వివాహమాడెదవు. రాక్షసవివాహమున గొనిపోదువని హృదయకమలమున నమ్మియున్నాను. తుదకు నన్నునీవు ప్రేమింపనిచో ప్రాణహత్య జేసుకొనుచు ముందు జన్మమునైన నీవె నాపతివిగా గోఱు

చు ప్రాణముల విడచెద ఎంతవిలపించినను నీపలుకొక్కటియు వినరాదు. ఏదీ నీమురళిని మోయించి నాకు కర్ణానందంబు గావించుము. (కొంచెమూరకుండి) ఆహా! మహాపాపాత్మురాలిని ఆమహాత్మునితోచెల్మి వాటిల్లుట యెన్నఁడోగదా!

సీ॥ కడుపునకేశవుంగనుటకు పుడమి దేవకిదేవిపట్టిన వ్రతము లేమొ!
వెన్నముద్దలబెట్టి ప్రేమతో బెంప నందునిసతి నోచిననోము లేమొ!
హాయిగా దివ్యవనాంతరంబులనాడఁజెలియు యుద్ధవుని యదృష్టమేమొ!
కురువిందజాజినికుంజంబులను కోరికలదీర్చికొన గోపికలయదృష్ట

మేమొ! రాధాసతీపుణ్యమేమొ గాని
అఖిలసుగుణాబ్ధితోడ సఖ్యంబువాడమొ
యంతటిసునీమములను నే నకట! వట్ట
నైతిగాబోలు పూర్వమందైనధరణి॥

హాకృష్ణా, హాకృష్ణా, (అని స్మరించుచు మూర్ఛిల్లును)

సరో—(ప్రవేశించి) అదుగో రుక్మిణి విరహాతిరేకంబున మైమరచి, కృష్ణుని తలచి తలచి నిదురించినది. (దగ్గరజేరి) దేవీ! దేవీ! (తాకి) ఈమె మోడలు కామముచే పీడింపబడి కృశించి వేడిమిగానున్నది.

సీ॥ గోరువంక చిలుకలకును పలుకులను నేర్పు వనితమౌనవ్రతమున మునింగె
మల్లియజాజుల మాలికలగగూర్చు వనితయేటికి యివ్వియనుచునుండె
పచ్చకప్రంబు జవ్వాజియుపందిన కడువేడిమియటంచు కసరుచుండె
కురులచిక్కులదీర్చుకూర్చుండుమాయనఛీయటంచునుదిట్టుచెలులగొట్టు

కన్నుదమ్ములకునుబెట్టు కంకణములు
ఏటికికనాకివియటంచు నేడ్చినగలు
వివిధభూషణములగొట్టు భువినిపగలు
రాత్రులనకయు వగచు విరాళిబొంది.

కట్టా, ఈపడంతియవస్థ దిలకించిన నాకుజాలిగల్గుచున్నది. ఈమెతోజేసిన చెలిమి వర్ణించుటకు వేనోళ్ళచిలువరేనికైన నసాధ్యంబు.

పాపము రుక్మిణికోరిన వాసుదేవునిగూర్చక తల్లిదండ్రులమాటల కెదురించి మాక్రూరరాజు రుక్మి—దుర్మార్గుడగు శిశుపాలునకీయదొడగె, ఎల్లుండియేగదా, వివాహమని పౌరోహితులు నిర్ణయించిరి. ఎటులైన నీమెను శిశుపాలునకిచ్చి పెండ్లి చేయకమానరు. ఈమె హాకృష్ణాయని దిగులుచేత బ్రావకమానదు. (నిదానించి) సందేహమేమి? ఇప్పటికే శిశుపాలునకిత్తురని నిద్రాహారంబులువదలి కృశించినది. అమ్మారుక్మిణీదేవీ! దేవీ! (అని పిలిచి యటుయిటుచూచి) ఇదుగో కదలుచున్నది.

రుక్మిణి—హాకృష్ణా, హాకృష్ణా, (కనులుతెరచి సంతోషముతో గాఁగలించుకొని) కృష్ణా వచ్చితివా, నీకొరకెంతయో విలపించుచుంటిని. నేటికిమదీయజన్మము కృతార్థతనొందె. (అని ముద్దిడబోవును)

సరో—దేవీ, ఏమిది కృష్ణునిగాను మీదాసి సరోజినిని.

రుక్మిణి—(కౌఁగలివదలి) నీవటె-ఎందులకరుదెంచితివి?

సరో—నీవు విరహతాపముచే కృశించుచుండుటవిని నీకు తాపోపశమనం బొనర్చుటకై వచ్చితిని. సరికాని—రేపులేదు. ఎల్లుండి పెండ్లియట.

రుక్మిణి—ఎవరిది?

సరో—నీది.

రుక్మిణి—ఎవరికి?

సరో—కృష్ణునకట.

రుక్మిణి—(సంతోషముతో) చెలీ! ఎల్లుండినిజముగ నావివాహమా! మావారందరు కృష్ణునకిచ్చుట కొప్పుకొనిరా! ఏమది! నాకష్టము లీడేరు కాలమువచ్చినదిగాబోలు. (ఆతురతతో) సరోజనీ! ఎంత హర్షకరంబైన సంగతిజెప్పితివే! సరికాని-ఇకనిచ్చటనుండుటేల! మన యారామసీమకరగి యెల్లుండిబంతులాడునప్పుడు కృష్ణునకు వేయుటకు చేమంతి, సంపంగి, బొండుమల్లియ, పారిజాతము మొదలగు

ప్రసూనంబుల గోసి తెచ్చి, మాలికలుగూర్చుదము రమ్ము. (ముందు నకునడచును)

సరో—(తనలో) ఆహా యేమీవనిత! నే నీ మాట నుడివినంతనే వగ చునదియెల్లనగుచు, సరములగూర్చుదము రమ్మనుచున్నది. మరల శిశుపాలునకని జెప్పినచో నేమియనునో (ప్రకాశముగా) అమ్మా, ఏమాత్రొందర! వెళ్లుదములెమ్ము.

రుక్మిణి—సరోజనీ! వెనుకంజ వేయుచుంటివేల? నీవుచెప్పినమాట కాదా యేమి?

సరో—కాదు.

రుక్మిణి—శిశుపాలున కేనా!

సరో—అవును.

రుక్మిణి—(విడుముడిపాటుతో) ఛీ-పోమ్ము, నీమొగము జూడగూడదు. దిగులుతోనే వగచుచుండ నీకు హాస్యముగానుండెనా, ఎవ్వరితో చతురాడవలయునో తెలియదా, (అనినడచును)

సరో—(చేయిపట్టుకొని) తల్లీ, తప్పుక్షమింపుము. నీతో హాస్యమాడుట గాదు. నీమనోనిశ్చయముగనుట కిటుపల్కితిని.

రుక్మిణి—అయితే నిజముగా—ఎల్లుండియేనా పెండ్లి. శిశుపాలున కేనా?

సరో—నిజమని-మీాయన్న పట్టణమలంకరించుటకు సేవకుల నియోగించి నాడు.

రుక్మిణి—(తనలో) అయ్యో వివాహకాలముగూడ సంప్రాప్తమాయెను. నాకోరిక నెరవేరదుగాబోలు. ఈసంగతివినిన కృష్ణుడుమాత్రమేల యంగీకరించును, (కోపముతో) ఓవిధీ! దుర్గుణనిధీ!

ఉ॥ ఏలర, యాడుదానిగ మహీస్థలియందు సృజించితైనచో
జాలగసౌఖ్యసంపదల సంధిలజేయక మానసంబునం
దే లలిగోరినట్టి వసుధేశునిగూర్చక, క్రూరబుద్ధివై
కూళనుబెండ్లియాడుమని గూడశిక్షించితె ఘాలమందునః॥

(ఆలోచించి) అవును. విధియేమిచేసినాడు. నాకర్మమున కాయ నేమిచేయగలడు?

సరో—అమ్మా, రుక్మిణీదేవీ! నిన్ను కృష్ణుడు వరింపనిచో—నేమిచేయు దువు. శిశుపాలుని......

రుక్మిణి—ఆ. ఆగు. ఆతుచ్ఛుని పేరెత్తకుము. ఆతనితలంచిన నామనంబున నుద్రేకము జనించుచున్నది. ఏమి-నన్ను కృష్ణుడువరింపడా, వరిం పడా, వరింపనిచో నికజెప్పనదేమియున్నది.

చ॥ గరళము లేదె త్రిమ్మంగ వెతకంగ నదీనదముల్ కృపాణముల్
సరసులు కూపముల్ శిలలు చాలగనున్నవి గట్టిత్రాడు లే
సరణినిగాని గాసిపడి చచ్చెదనంచు నిరంతరంబునే
స్థిరమతితోడ నుంటినిసతీ! రమణుండు వరింపకున్నచోన్॥

సరో—కృష్ణుడు నిన్ను జేబట్టనిచో జచ్చుటకైన నొప్పుకొంటివికాని చైద్యుని మగనిగాబడయ సమ్మతింపవుగదా!

రుక్మిణి—అవును. గాని యెల్లుండిలోపల కృష్ణునినుండి జవాబువచ్చునది యెట్లు?

సరో—అమ్మా, మన సదనంబునకు ప్రతిదినంబు పంచాంగము చెప్ప వచ్చుశుచి యను నొక బ్రాహ్మణుడొకడుండెను. ఆయనసందేశముగొని చనునుగాని మరియెవ్వరు పోరు. ఆయన చాలమంచివాడు. నాతో నెంతోచనువుగా మాట్లాడును. నీసంగతి విన్నవించిన తప్పక సమ్మతించును.

రుక్మిణి—నీకొక చంద్రహారంబొసంగెదగాని ఎటులైన నావిప్రుని తీసి కొనిరమ్ము.

సరో—మాట నెరవేరవలయునేగాని చంద్రహారము నాకెందులకు?

రుక్మిణి—(విరహముతో) సరోజినీ, ఇంకజాగేల, బిరానజని విప్రుని దోడ్కొనిరమ్ము. నీకేమైన పనులున్నచో బ్రాహ్మణునినైన బంపుము. మిత్రురాలియందు దయయుంచుము.

సరో—అమ్మా! అంత నొక్కిచెప్పవలయునా? నీకోర్కె నెరవేర్చెదను దిగులుపడకు (ఆలించి) అరుగో—అమ్మగారు నన్ను బిల్చుచు న్నారు. సెలవు, సెలవు, (అని నిష్క్రమణ.)

రుక్మిణి—హాకృష్ణా!

ఉ॥ నీవదనాంబుజంబురుచి నిత్యము హాయిగ గాంచి, కాంచి, స
ద్భావము తోడ నీచరణ పంకజసేవల జేసి చేసి, కే
ళీవనరాజికుంజముల లీలలగానడయాడి యాడి ని
న్నోవనజాయతాక్ష యెపుడోగద బిగ్గ గవుంగి లించుటల్॥

(క్రోధముతో) ఏరా! యదుకిశోరా! ఎంతజాణుడవు? ఎంతపిలిచిన నవలోకించకుంటివా! (నిదానించి) అవును గోపికలతో సరసమాడుకొనుచు సౌధరాజంబుల మెలంగెడి నీకు నావంటి కృశాంగన గనుపించునా! గనుపించదు (ఆలోచించి) నాకువెఱ్ఱియాయేమి! దేవకీదేవి గర్భపయః పారావారరాకా సుధాకరుండును యదుకులాభరణుండును నారీజనహృదయ ధనపశ్యతోహరుండును మదీయమానస సౌధాంతరంబున నిరంతరంబు కాపురంబు సేయువాడునగు కృష్ణుండు వరియించక నిరసించునా! నిరసించడు. మరియు,

తే॥ హరినిదలచుచు నామతి తిరుగ దేని
కూళు శిశుపాలునెన్నడు గోరనేని
అవనియందు మనస్వినినైయెతినేని
కమలనేత్రునకుం దయ గలుగుగాక.

అదుగో ఎవరో పిల్చుచున్నారు. (నిష్క్రమణ.)

శ్రీ రస్తు.

# రుక్మిణీ సందేశము.

## ద్వితీయాంకము.

ప్రథమరంగము - సౌధము.

రుక్మిణి—అకటకటా! యీవిరహసాగరమెన్నడు దాటెదనోగదా! (కనుల నీరిడి)

సీ॥ శంఖమా! కరుణనాజాడ భూజానితో మనవిసేయుము కోరితినియటంచు
చక్రమా! దేవతాచక్రవర్తినిగాంచి హితవుగాబల్కు వేడితినటంచు
వాడిగల్గిన కరవాలమా! వసుదేవుసుతునితో జెప్పు సమ్మతినటంచు
విష్కరావళిరాజ వీరప్రతాపుతో దయనునుకుపు చిన్నదానినంచు
అన్నము సహింపదంచు నీరంటదంచు
భావజుని వేదనకు సన్నబడెనటంచు
వాసరంబులు గడచిన మోసమంచు
పద్మనేత్రిని జంపిన పాపమంచు॥

అయ్యో యేమిది కనులు దిరుగుచున్నవి. మనస్సు ఈర్ష్యబూను చున్నది. డగ్గుత్తికపడుచున్నది. ఇంతలోనే—శరీరముఃగూడ జల్లబడినది. (నిదానించి) హారుక్మిణీ! యెంతపిచ్చదానవే! కానికోరికబెట్టుకొని యల్లాడుచుంటివి. (ఆగి) ఆ! కానికోరికయా!—ఏమిది అటులైన నీజీవచ్ఛవంబేల! ప్రాణత్యాగంబు జేసిన నే దుఃఖములేదు. హాకృష్ణా! (అని ప్రియత్నించును.)

అగ్నిద్యోతనుడు—(ప్రవేశించి) అమ్మా రుక్మిణీ! ఆగుమాగుము. ప్రాణములపై నిరాశబూని పోగొట్టుగొన సాహసింపకు.

రుక్మిణి—(ఉలికిపడి తనలో) ఓహో ఎవ్వరీ మహాపురుషుడు. కృష్ణుడు, నన్ను తప్పక వరించును. కానిచో—మరణకాలమున నీతిడద్దు పడదు. (ప్రకాశముగా) నాయనా! వందనములు ఎవరుమీరు!

అగ్ని—కళ్యాణమస్తు. మనోవాంఛాఫలసిద్ధిరస్తు. అమ్మా నేనీపురినివాసుడ. బ్రాహ్మణుడ. అగ్నిద్యోతనుడను నామము గలవాడ. నీవెందులకో పిల్చితివని మీదాసిసరోజిని చెప్పినది. అంతట వచ్చితిని.

రుక్మిణి—భూసురాగ్రణీ! జనక సదృశులగు మీయొద్ద తనయసమానురాలనగు నేను విన్నవించుటకు లోపముండదు.

అగ్ని—అవును. జరుగవలసిన కార్యమేమి!

రుక్మిణి—అదియే జెప్పెద నాలకించుడు. నాకు కృష్ణుని యందధికమోహమున్నది. మాయన్న నన్ను కృష్ణునకీయక దుష్టుండగు చైద్యునకీయనెంచి యెల్లుండి లగ్నము నిశ్చయించిరట.

అగ్ని—అయ్యో ఎంతద్రోహము దురాత్ములకు దూరాలోచనలు లేవు గదా! తరువాత.

రుక్మిణి—కనుక మీరు నాయందు దయారసంబునుంచి ద్వారకాపురికిజని కృష్ణుని నగరు ప్రవేశించుడు.

అగ్ని—పదంపడి.

రుక్మిణి—ప్రవేశించి గోపికలతో క్రీడలు సలుపక యేకాంతంబుగానుండు నత్తరి నామనవి తిన్నగా విన్నవించుము,

అగ్ని—అమ్మా!—ఏకాంతంబేల! గోపికలున్న నేమి!

రుక్మిణి—తండ్రీ వలదు. దగ్గరకామించిన పడంతులుండిన యంత నీసంగతి జెప్పిన వారి మనంబుల కనుమానంబు గలుగునని, నాప్రార్థన నంగీకరించుడు.

అగ్ని—అయితే!—యేమని చెప్పవలయును?

రుక్మిణి—అదియే జెప్పెద నామారుగా నమస్కరించి యిటు విన్నవించితి ననుము.

సీ॥ సకలావనీనాథనికరశిరోమణియగు వానికిని దండమంటిననుము
తనయసక్రపరాక్రమనితాంతకీర్తిని ప్రియుసమాచరిచేత వింటిననుము

వినినంతనినుచిత్తమున వరియించియు చెఱకువిల్తునిబారి జిక్కినను
దుర్మదాంధుఁడు రుక్మిదుష్టాత్ముఁడైన చైద్యునకీయవలెననియుండెనను

ఉర్విని ర్జరపెండ్లి యొల్లుంచియును
దంతవక్త్రాదిక్రూరుల దర్పమడఁచి
నన్నుఁగైకొనిపొమ్మను మిన్నియేల
నతఁడురాకున్న జచ్చెదననుము నిజము॥

అగ్ని—తల్లీ యాలాగైన జాలము కేలసేయుట యిప్పుడ ప్రయాణమయి సాయంతనమునకు, ద్వారకఁ జేరి, వాసుదేవునిదర్శించి సందేశంబు గొనివచ్చెద నీవుమాత్రము శోకింపకుము. భగవంతునకు నీయందు దయవచ్చును లెమ్ము.

రుక్మిణి—మరచితి నింకొకసంగతివినుఁడు. నేనంతఃపురములోనున్న నెట్లు తీసికొనిపోదునని మానుదేమో! అట్లయిన వివాహమునకు ముందరగా గౌరీపూజకు, మావారు తీసికొనిపోయెదరు. అప్పుడు కక్ష్యాంతరములు వెలువడివచ్చెదను. అంతట గొనిపోవచ్చునని నొక్కిచక్కగా వక్కాణించుము.

అగ్ని—అమ్మా సెలవు. పోయివచ్చెద. (అనినిష్క్రమి.)

రుక్మిణి—ఆహా దైవకృపవలన సందేశముబంపితిని. కాని వాసుదేవునికటాక్ష మెట్లున్నదో గదా! (నిదానించి) హాకృష్ణా ! హాకృష్ణా ! ఇంతపగాకేల! కామించిన సతినిగవయుట మహాపుణ్యంబని పురాణములు జెప్పుచుండ కామాన్వితనగు నాకోరికలేల దీర్చవు? (ఆలోచించి) అవును. అబద్ధమేమి! ప్రాణనాథునకే దయలేనప్పుడు దైవమునకుమాత్ర మింకెక్కడిదయ? నాజీవితేశుండగు గోపాలకృష్ణునే ధ్యానించెద. (కరములుమోడ్చి) హాకృష్ణా!

మ॥ మురళీనాదము కర్ణయుగ్మమున నామోదంబుగావింపగా
నురమందుం మణిరాజిలం శిరమునందొప్పార బర్హాళితో
డరుదేరం వ్రజకాంతసంఘములు దేవాయంచు స్తోత్రంబులం
జనుపం మానులు దర్శనంబిడుమ కృష్ణా! భక్తరక్షామణీ!॥

వాసుదేవా! దీనజనబాంధవా !

మ॥ యదువంశాంబుధి పూర్ణచంద్ర దరహాసాస్యా! నమోకృష్ణ! ప్రా
జనవుల్ శాస్త్రములుం బురాణములు నిం జర్చించుచుండంగ నే
నదియాలించి మదీయప్రాణపతిగా నాత్మన్ నినుం గోరితిం
సదయం జూడుమ యేలికొమ్ము నను కృష్ణా భక్తరత్నామణీ॥

(ఆకసమువంక జూచి) కృష్ణా! ఏదీ! నీదివ్యమంగళవిగ్రహము జూపుము.

మ॥ అరయన్ విష్కరరాజుపై శబరిపై నార్యామహాదేవిపై
కరిపై గోపజనాళిపై సురలపై గాంగేయుపై రాధపై
ధరణీదేవునిపై మహేశునివయం గైతేయుపై బారు నీ
కరుణాదృష్టిని బంపునాపయిని సత్కారుణ్యవార్ధీపతీ॥

హే కృష్ణా! నీవు ద్వారకలోనున్నను నాహృదయపంకజమునుండి బాసినగదా—నీవు నన్ను బాసినట్లు ఒక్కసారి నీనామస్మరణ జేసినంత మాత్రమున నే నాయొడలు పరవశమగుచున్నది. ప్రేమింపుము. ప్రేమింపుము. కృష్ణా (అని యేడ్చును.)

కమల—(ప్రవేశించి) తల్లీ వగచు టేల! రేపు వివాహమగుచుండ తలనైన దువ్వుకొనక పోతివి. దిగులుచేత నెంతో కృశించితివి, (అని చేతితో ముంగురులుసర్దును.)

రుక్మిణి—కృష్ణుడు వచ్చినగదా!

కమల—కాదు శిశుపాలునకట. శిశుపాలాదులు పుత్రమిత్రకళత్ర బంధువులతో రేపుతర్లివత్తురట.

రుక్మిణి—అమ్మా! మన దేకులము.

కమల—క్షత్రియులము.

రుక్మిణి—క్షత్రియులకు మారుమనువు లేదుగదా! నాకీమాగుమను మేమిచూడు.

ఆ॥వె॥ ధనసహితుడునైన దారిద్ర్యయుతుడైన
అబలుడైన కుంటియైన రాజ్య
హీనుడైన పాపియైనచోరుండైన
వలచినట్టిపురుషు వలవవలదె॥

కమల—ఇప్పుడు నిన్నుమాత్రము వలదంటిమా, కాని, కృష్ణునికిని మీరాయ
న్నయగు రుక్మికినిపగయట. కనుక శిశుపాలుని వరించుము.

రుక్మిణి—తెలిసినదా? ఇందులకే మారుమనుమని చెప్పినది.

కమల—ఏమి!

రుక్మిణి—అట్లయిన చెప్పెదవినుము.

శా॥ అమ్మా సిన్నటనాడె తాపసులచే నాలించితిన్ వాని రూ
పమ్ముల్ సత్యశమార్య సద్గుణప్రతాపమ్ముల్ మహాత్యాగ భో
గమ్ముల్ దీనజనావనుండనెడి వాక్యమ్ముల్ సిరుల్ యుప్పెదే
హమ్మెల్లం బులకాంకురింప లలనా హర్షించి నేగోర నీ
విమ్మార్కిన్ శిశుపాలుగోరు మన సాధ్వీ! ధర్మమే నీకిటన్॥

కమల—అమ్మా రుక్మిణీ!

తే॥ పుడమిఁగలవాడు పగతులనడచువాడు
తెలివిగలవాడు చాలమేదినిగలాడు
కరుణగలవాడు సుజనులగాచువాడు
సరస పదజృంభణగలాడు చైద్యుడరయ॥

కనుక నీజననీజనకులయం దభిమానముంచి మాటలకెదురాడక, శిశుపాలుని వరింపుము.

రుక్మిణి—కృష్ణుడైశ్వర్యవిహీనుడా—బలనికృష్టుడా—త్యాగభోగ శీలుడు
కాడా—యేటికీవాదము?

కమల—తల్లీ! నుడివెద నాకర్ణింపుము.

తే॥ భృత్యకులకునగరులకు సౌభాగ్యమునకు
వాజిరాజికిపూజింపబడుట కచ్యు
తునకు సరిరాడుగాని మానినిరో చైద్యు
నకును రాజ్యంబుగలదది యొకటెఘనత॥

రుక్మిణి—ఏమీ! కృష్ణునకు రాజ్యములేదనియు రాజ్యార్హత లేదనిగా
నీవు నుడువునది చూడుము.

చ॥ ధనములుగాల్పనే యడవిదార్పనె రాజ్యముఁ లెల్ల సంభ్రమం
దునబడవేయనే కరులనుం దురగంబులగట్టగట్టి దు

ర్జనునకునెన్ని యున్నను విచారకరంబగు లోకమందు స
జ్జనునకునున్న నల్పమయి సద్యశమార్జన సేయు నమ్మరో॥

కమల—తల్లీ! యాదవుండుగదా! తక్కువజాతివానిగోరుట నీకుమాత్ర మేమిధర్మము!!

రుక్మిణి—(కోపముతో) ఏమి. నేనుగోరిన నా నాధుండు నీచుడా- హీనుడైనను నామనంబిక వాసుదేవునినుండి మరల్పను.

తే॥ చైద్యుడాది దురాత్ముల సమరరంగ
మందడంచియు సజ్జనులార్తిదీర్ప
జననమందిన దేవతాచక్రవర్తి
గాని వసుదేవతనయుండు మానవుండె॥

మరియు వినుము॥

తే॥ సర్వవిష్టపములను ప్రశాంతమదిని
నాననాంబుజమున దాల్చి యలరు హరికి
వసుధ యించుక లేదు భూపతియుగాడ
టంచుపల్కెదు వినజను లవనినగరె॥

కమల—(తనలో) కట్టా! మహాభోగుండై చతుష్షష్టి కళాధురీణుడై -నృపుసింహుడైన- కృష్ణునకు పాటియెవ్వరు? (ఆలోచించి) అవును- చతుర్దశ భువనంబుల బొజ్జలోధరించి నేవకులగా తక్కిన రాజులచే నేలనేలించుచున్నాడు. ఒక్క- దేశమేమి! ప్రపంచ మంత యాయనదేగదా! (నిదానించి) రుక్మీ! నీసోదరికి యెంత కష్టము దెచ్చిపెట్టితివి? లేక లేక యొక్క- చెల్లియుండ నదికోరి నట్లుచేయక యితరుల కిచ్చుటేల? ఇంతకు నీయప్రయోజకముల జూడుమని మానోసట వ్రాసియుండ నిన్ననవలసిన దేమియున్నది. (ప్రకాశముగా) అమ్మా! రుక్మిణీ! శిశుపాలునే వరంపుము. కానిచో- రుక్మిచే కష్టములు సంప్రాప్తమగును.

రుక్మిణి—వాసుదేవుని చెట్టబట్టకయున్న నెవ్వారిప్రయత్నము లేకయే జీవంబుల బాసెద. నిశ్చయము . అదిగాక—

చ॥ అలదమయంతి భూసుత ప్రియంవద చంద్రమతీ జయప్రదా
చలవరుజాత గౌతము ప్రియాంగన యశ్వవతీ సుతాదులే
లలిజనినారో! యట్టులకళంకమనంబున వాసుదేవునిం
దలచితి భర్తగా పుడమి నాటికి నేటికి వాడెనుమ్మికన్॥

కమల—కుమారీ!-నీసంగతిగురించి, మీతండ్రిగారు మహాదుఃఖాత్ములై శయనగృహామందు విచారించుచున్నారు. చూచివచ్చెదముఁరమ్ము.

(ఇద్దరు నిష్క్రమణ.)

## 2 వ రంగము.

### ద్వారకాపురి మార్గము.

అగ్ని—శ్లో॥ ఇందీవరదళశ్యామ మింగిరానందకందళం
వందారుజనమందారం వందేహం యదునందనమ్॥

ఇస్ అబ్బా! ఎక్కడ విదర్భ, ఎక్కడద్వారక, ఎంతదూరము, ఎంతదూరమైనను, నాకీదివంబున దూరముగానుండ లేదు. మున్ను సీతజాడదెలిసికొని వచ్చుటకు హనుమంతుండు సంద్రముదాటు నప్పు డావనధిమధ్య నారామదూతకు సేదతీర్చుటకై చనుదెంచిన మైనాకునివలె మహాలక్ష్మీస్వరూపురాలైన రుక్మిణీసందేశంబు గొనిపోవు నాకాయాసము గలుగునేమోయని భాస్కరుం డీయుదయంబునుండియు, జల్లబడినాడు. ఆహా ! యేమిసముద్రము! చింతామణి కామధేనువైరావతము లెచ్చోటజనించెనో-సర్వజగద్రక్షకుండగునారాయణుండెచ్చోటనివసించునో శ్రీయిందిరా చంద్రుల్ర్వ రెచ్చోట పుట్టువొందిరో-గంగాభవానియెవ్వాని గృహాంగణమందలంకరించెనో - సర్వస్రోతస్వినీమతల్లుల కెవ్వడధినాథుడో - యట్టి ఈ సముద్రునిదర్శనంబు మనంబున మహాద్భుతహర్షంబుల గల్గజేయుచున్నది. ఇంతకు రుక్మిణీసందేశంబు కృష్ణుండంగీకరించిన నీ కష్టములన్నియు సుఖములుగా మారును. పాపము-రుక్మిణీదేవి మన్మథావస్థలోబడి కృశించుచున్నది. ఈ కార్యము నెరవేరిన యీమెను బ్రతికించినవాడనగుదును. (పరికించి)

అప్పుడే యెంతత్వరితముగా - ద్వారకాపురిదాపునకు వచ్చితిని!
ఈ ప్రదేశ మెంత మనోహరము!

ఉ॥ అంబుధితీరమందునవె యావులమందలు, పచ్చిపూరి మో
దాంబుధి దేలుచుం దినుచు హాయి జరించుచు నుండెనాడ, నా
కంబును నంటుకోటలనికాయము లల్లవె గాంచవేగహ
ర్షంబు జనించె నా హృదయసారసమందున ధన్యుడంగదా!॥

ఆహా!

మ॥ అరుగో! వారలె గోపికావనిత లుద్యత్ప్రౌఢి సౌధంబులం
గరమొప్పారగ రాగతాళములనక్రీడాత్ము గీతంబులం
దరహాసాస్యులరయ్యు పాడుకొనుచున్నారల్ ముదంబాయె సం
బరమందాకెడి వాసుదేవుని మహత్ప్రాకార రత్నంబదే!

ఇదుగో ఈ పట్టణసింహద్వారం బెంత నేత్రానందము గల్గించు చున్నది. ఈ ద్వారము సొచ్చి, పురంబు ప్రవేశించి, కృష్ణునినగరంబు గనుగొని కార్యంబు నెరవేర్చికొనెద. (నిష్క్రమణ.)

## 3వ రంగము.

### ఉద్యానవనము.

కృష్ణుడు:—(ఆసనాసీనుడై) ఆహా ఈవనంబు కడు రమణీయంబు.

సీ॥ మందారమాలూర మార్జనోద్దాలకుద్దాల జంబీర రసాలచయము
సారసకీర మయూర కలగళ సంజనితగానవినాద ఘనచయంబు
చందనమాలతీ చంపక విరజాజి కడిమిలతాంతనికాయభరము
రాజీవ పద్మినీరాజికావాలమై రాగంబొసంగు సరోగణంబు
దుఃఖనాశనకరము సంతోషకరము
అరయు మానవులకు బహు హాయికరము
వసుధపై నందనోద్యాన వనసమంబు
తరమె వర్ణింప నీ ప్రమదావనంబు.

(లేచి నడయాడి) అదుగో! అకాంచన వృక్షమెంత పూలగుత్తి విడచినది. (కోసి) ఇది యెంతరమణీయము దీని నెవ్వారికొసగుదు. (ఆలోచించును)

అగ్ని—(ప్రవేశించి) కృష్ణా! ఆలోచింపనేల! దానికంటెను శిరీషపేశల తిరస్కార శరీరవతియగు నీ ప్రియాంగన కీయవచ్చునులెమ్ము త్వరపడకుు.

కృ—(ఆతురతతో) ఎవరీ మహాభాగుడు. ప్రియవాక్కులబలుకుచు నపర శివునివలె బూది మెయినిండ దాల్చి వెలుంగుచున్నాడు. (దగ్గర జేరి) భూసురాగ్రణీ! వందనములు.

అగ్ని— సౌందర్యవతీ ప్రాప్తిరస్తు.

కృ—(తనలో) ఏమిట్లనుచున్నాడు (తలనూపి) అపును ఏ రాకుమారి వద్ద నుండియో సందేశార్థము గొనివచ్చెనని యూహాపోహములుచున్నది (ప్రకాశముగా) భూసురోత్తమా!

ఉ॥ ఎయ్యది పత్తనంబు, కులమెయ్యది మిమ్ముబాగాచు సద్గుణుం
డయ్యవనీశుడెవ్వడు మహాత్మ మరెవ్వరుపంపినారు ని
న్నియ్యెడ కేప్రయత్నమున

అగ్ని—హే యదువంశపయోధిచంద్ర రా
వయ్య కృపాంబురాశివి గదయ్య కుమారిక కేల్గ్రహింపుమా॥

కృ—అయ్యా! తమరీయాసనం బలంకరించి తద్వృత్తాంతంబంతయు నివేదింపుడు.

అగ్ని—(కూర్చొని) కృష్ణా, అవధరింపుము.

సీ॥ సకలపురీవర ప్రకరరత్నము విదర్భానగరంబు నాపట్టణంబు [బు]
సతతంబు వేదశాస్త్రములనేర్చుచునుసదాచారమూను బ్రాహ్మణకులం
సత్యశమదమాది షడ్గుణనికరంబు ఘనముగాకూడబెట్టినధనంబు
సచ్ఛాత్రవరుల కుషఃకాలమునను ప్రాజదువులజెప్పుటపదవిసతము
చిత్తమున నీదుధ్యానంబు జీవనంబు
నమ్మియుండుటె దాతల నాసుఖంబు
కీర్తువులను జేయుటె నాకుగలమతంబు
నిన్నుగనిసంత మదియుగనెన్ ముఖంబు॥

కృ—అయ్యా,

తే॥ శుభమెమీకు? పరిమోదమే సుతులకెల్ల

చుట్టములకును హితులకు సుఖమె? గోత్రి
జులకు ప్రజలకు మీపురీశునకు ముదమె?
మంత్రివర్గంబులకును సేమంబెయార్య॥

అగ్ని—వినుము. మావిదర్భాధీశ్వరునకొక్క కుమారికగలదు. ఆమెపేరు రుక్మిణియనెదరు. ఆజవ్వని నీధైర్యశౌర్యాది సద్గుణగణంబును సౌందర్యాతిశయంబును విని నిన్నువరియించ నాపడంతి యన్న యగు రుక్మి శిశుపాలున కొసంగెదనని పల్కుచుండ గుక్మిణి కుంది, కృశించి, నన్నుగాంచి, ఈసంగతిజెప్పి నీకుసందేశంబు బంపినది.

కృ—ఏమని?

అగ్ని—అవధరింపుము. నామూలముగా నమస్కరించి యిట్లనుమని,

సీ॥ సకలావనీనాథ నికరశిరోమణి యగువానికినిదండ మంటివనుము
తనయువకవరాకవునితాంతకీర్తిని ప్రియసహచరిచేతవింటిననుము
వినినంతనినుచిత్తమునవరియించియు చెలుకువిల్తునిబారిజిక్కెననుము
దుర్మదాంధుడురుక్మిదుష్టాత్ముడైనచైద్యునకీయవలెననియుండెననుము
ఉర్వినిర్జర! పెండ్లి యెల్లుండియనుము
దంతవక్త్రాది క్రూరుల దర్పమడచి
నన్నుగైకొనిపొమ్మను మిన్నియేల
నతడురాకున్న జచ్చెద ననుము నిజము॥

కృ—ఏమీ, రేపేనాపెండ్లి, అట్లయిన నేనెట్లు చేకొందును.

అగ్ని—అటులైనవినుడు. కళ్యాణమునకుముందుగా గౌరీపూజకొరకు, నగరము వెలువడి గౌరీదేవాలయమునకడకువచ్చునట. అత్తరిరుక్మిణి పార్వతీ పరమేశ్వరుల దర్శించి వచ్చునెడ, నరదంబుపై నిడికొని శిశుపాలాది నరాధముల దృణీకరించి, ద్వారకకు రావచ్చునని గట్టిగా జెప్పినది.

కృ—పాపమావడతిస్థితియేమి? దానియూహ లెన్నదగినవి. (ఆలోచించి) కానిచో - సామాన్యపడంతికింత యూహబోవునా? పోదు.

అగ్ని—ఆ॥ వె॥ ఆపడతిమోము సర్వకళాకరంబు
ఆవనితమానసము సుగుణాలయంబు
ఆవెలదివాక్యగణము సుధాన్వితంబు
ఆయువతినేత్రయుగము మోహనకరంబు॥
మరియు సౌందర్యమునకు మేరయే లేదు.

కృష్ణ—ఇప్పటిరుక్మిణి యవస్థ చెప్పుట కెవరితరముగాదు. మొన్న సందర్శనముగల్గినప్పుడామెను దర్శించగనే నాకు కనులనశ్రుబిందువులు వెలువడినవిచూడు.

ఉ॥ కన్నులగారునీరు కరకంజములన్ దుడువంగబోదహో
పెన్నెరిగుంపు చిక్కువడవీడగదీయదు డాయగ్నాళులం
అన్నముముక్కబోదు వలదంచు నలందదు మేనగస్తురిం
గిన్నెరమీటబోదెపుడు శ్రీగుణాకర దేవకీసుతా॥

కృష్ణ—భూసురా! వేయేల!

ఉ॥ వింటినిమున్ను రుక్మిణి పవిత్రచరిత్రము రూపురేఖలన్
వింటిని నన్నుగోరుట వివేకమువింటిని విన్నదాదిగా
తుంటరి యిక్షుబాణుఁడిదు తోయజపత్రములంగ్రశించియే
నుంటినియింక భూపతులనుక్కడగించి పరిగ్రహించెదన్॥

అగ్ని—కృష్ణా మరియువినుము.

ఉ॥ హాయదువంశపూర్ణతిలకా సుకుమారమనోహరావరా
హాయదుసింహ దీనవరదా సరసీరుహపత్రనేత్ర నీ
కాయముతోడ నింగలియగా లభియింపమి ముందుజన్మమం
దే యభవా నినుం వలతు నిశ్చయమంచు విచారమందెడిన్॥

కృష్ణ—సౌధాంతరంబున శుకనికరంబులకు కండచక్కెర లిడుచుసారతర శబ్దములజెప్పుచు వనాంతరంబుల తోడిసఖులతో నడఁగూడుచు లతాంతముల పేరులుగాగూర్చుచు నుండుపడంతి మీనకేతనుని బాణములకులోనై మౌనభావముదాల్చుచు వెఱ్ఱిదానివలె దిరుగుచు హాకృష్ణా! రక్షించరా! యనియేడ్చుచున్నది.

సీ॥ ప్రాణేశనామీద పంతమాయనినేత్ర కంజంబులనుబెట్టు కంకణముల
దీనజనావనా దిక్కునీవెయటంచు మౌనభావముదాల్చు మందగతుల
కాంతవనాంత లతాంతంబులను గాగిలించుమాయనుచు మూయించు
గనుల
సారసాక్షా యురోజముల నంటుమటంచు నావురింతలనింపుహారవముల
గీ॥ హాయశోదకుమార హాహాసుధీర
హామదాత్మ సరోజవిహారశూర
హాధరాధర వీరయాహామురారి
కరుణజూడర నీదానగాచుకోర॥
అని బహువిధముల దీనస్తోత్రముల జేయుచున్నది.

కృ—బ్రాహ్మణకులశిరోమణీ! అగ్నిద్యోతనా, విదర్భమునము జని నంతట రుక్మిణి నాయందేహ్యంబుగలిగి శిశుపాలునివరించిన జేయవలసిన దేమిటి?

అగ్ని—వాసుదేవా, నీ కీ సంశయమేల, హాకృష్ణాయనుచు నిట్టూర్పు లీడుచుచు, సందేశంబుబంపిన లేమ- మరియొక్కరిని గోరునా?

కృ—అట్లనకుడు "స్త్రీబుద్ధిః ప్రళయాంతకః" అనుసూక్తి రిక్తగాదుగదా, అదిగాక-స్త్రీలకు వలపుండునా?

అగ్ని—కృష్ణా! ఆమె దృఢనిశ్చయము గూడవినుము. కృష్ణుడు నన్ను ప్రేమించిన ప్రేమించును. లేనిచో ప్రాణత్యాగము చేసికొనెదనని మీతో గట్టిగాజెప్పుమని పావము బ్రతిమాలి నుపివినది. అటువంటి నిరపరాధిని-దీనురాలిని రక్షించిన మహాసుకృతంబుగదా!

కృ—అయ్యా, రుక్మిణి మనోనిశ్చయుము వినవలెనని యంటినిగాని-వేరొండభిప్రాయమేమియులేదు. వినుము.

ఉ॥ విందుజనంబుతోడ కడువీరభటావళితో నవీన సు
స్యందనవం క్తితోడ కరభాశ్వ గజప్రకరంబుతోడ గో
విందుడు వచ్చెవచ్చెనని వీరథరావరులెల్ల తల్లడం
బందగవత్తు చైద్యసమరావనినోర్చి గ్రహింతురుక్మిణీ॥

స్వామీ, మార్గాయాసంబుచే కడుప్రయాసము నొందితిరి. మేమిచ్చు నన్నపానాదులఁగొని కొంతతడవు విశ్రమింతురుగాకరండు.

అగ్ని—చిత్తము. (ఇద్దరు నిష్క్రమింతురు)

కృ—(ప్రవేశించి) హా అగ్నిద్యోతనా, నీవేల నాకీ సందేశంబుదెచ్చితివి, సందేశంబు వినినప్పటినుండి మదనుండు క్రూరుండై బాధించుచున్నాడు (నిదానించి) హారుక్మిణీ! హారుక్మిణీ!!

ఉ॥ నీయధరాధరామృతము నేరుపుమీరగ గ్రోలిగ్రోలి దా
క్షాయణినాథు జ్యోత్స్నలను గాఢపుగ్రీడల దేలితేలి చా
నా! యనురాగమూని సురతాంతములందున సోలిసోలినీ
హాయిగ గాంచుటెన్నడొగదా రమణీమణి రుక్మిణీమణీ॥

మన్మథా, నన్నేల నీరీతి బాములబాల్పరచెదవు. మహానుభావుండగు శివునికంటెమంటచే-భస్మంబైనను తులువతనంబింక నడంగలేదుగాబోలు, అటులైన-నాకొరత నేనుదీర్చెద. నన్ను బాధపెట్టక-రుక్మిణికే మనంబుద్రిప్పి, త్వరితముగనాకొనునట్లు జేయరాదా! (ఆలోచించి)ఔరా! ఎంతకఠినాత్ముడను నాకొరకు దిగులుపడి, కృశించి, విరహతాపమున కోర్వజాలక సందేశంబుఁబంపిన పడంతినింకను బాధపెట్టుమని నుడువుచుంటిని.

చ॥ వనరుహశస్త్ర నీదు శుకపాళివనంబుల పాలుగాను నీ
ఘననిశితాస్త్రజాలము జగంబునరాలుత యింతపావ భీ
తినివిడనాడి మర్త్యులమతిం జెడగొట్టెద నెల్లకాలముం
ననునిక జేరజంపెద ఘనంబగు విక్రమమూని మన్మథా॥

(ఆలోచించి) మానినీ, నన్నెంతకాలమునుంచి వరించి నాకొరకుకుంది, కృశించుచు, హాకృష్ణాయనుచు వగచుచుంటివోగదా! (తలనూపి) అవును. సందర్శనమున కవకాశమెక్కడిది. ఆ వనిత విదర్భయందు కక్ష్యాంతరముల నెచ్చటనో-హాకృష్ణాయనుచుండ నేనీద్వారకలో హారుక్మిణీయంచు కన్నీరుగార్చుచుంటిని. నాయిరువురికి స్పర్శసుఖంబెట్లు! (ధైర్యముతో) ఏమిది యధైర్యమూనుచుంటిని. రేపేగదా!- రుక్మిణిని నేను

రాక్షసవివాహమున గైకొనివచ్చుట నాకీసౌభాగ్యవతిని గూర్చినందులకు శంకరా! —నీకివే నమస్కారములు. హా కాంతా!

తే॥ శివుని సతతంబు మదిని పూజింతునేని
ధరణిసురలను బ్రోచుట దప్పనేని
దేవకీదేవికిని వసుదేవులకును
నందనుడనేని నిన్ను గైకొందుగాక॥

(తెరలో తథ్యము అని ధ్వని గల్గును)

(సంభ్రమముతో) అవురా! —నేను దలచినమాట తథ్యము తథ్యమని యాకాశవాణిగూడ నాకు సహాయముగా బల్కుచున్నది. ధన్యోస్మి ధన్యోస్మి! ఇక చింతించనేల! —తప్పక శిశుపాల దంతవక్త్ర సాళ్వవిదూరక పౌండ్రకాదుల సంగ్రామావనిం బటాపంచలు గావించి జయభేరిపూరించి వైదర్భిని యరదంబుపై నిడికొని ద్వారకకు గొనివచ్చెద.

తెరలో - కృష్ణా! ప్రయాణ సన్నాహముగట్టుము.

(ఆలోచించి) అదుగో —బ్రాహ్మణుడు విశ్రాంతి దీర్చుకొని విదర్భకు ప్రయాణమగుమని శీఘ్రరగా బల్కుచున్నాడు. నేనిచట—జాగు సేయుట మేరగాదు. (ద్వారమువంకజూచి) దారకా! —రథంబు సిద్ధము సేయుము సేవకా! —ఘటానీకమును జాగ్రత్తగానుండు మనుము. నేను గృహాంతరమునకుజని ప్రయాణ ప్రయత్నము జేసెద.

(అని నిష్క్రమం.)

## 4 వ రంగము.

ఉద్యానవనము.

విలాస మందిరము.

రుక్మిణి—(విరహముతో) హాకృష్ణా! నీప్రియురాలి నొక్కసారి కటాక్షింపుము.

ఉ॥ హా నవనీతచోర! వనితాళిరమాసుకుమార! ధీర! యా
హా నళినాక్ష! యాదవకులార్ణవసోమ! మహత్ప్రతాప! వీ
రా! నగరాడ్ధనూజనరదా! కరుణాకర యాదవేశ్వరా!
హా వనునేకకోర సదయాణయను సింహాకిశోరవల్లభా! ॥

దేవకీదేవీనందనా! నేనెన్నిపర్యాయములు స్మరించినను రక్షించవేమి! నేను పరదాననైతినా! (కొంచెమాగి) కట్టా! వాసుదేవుడు పరిగ్రహించునో—గ్రహింపడోయని కళంకముచే మనంబంతయు చీకాకుపడి భయముచే గుండెవ్రీలుచున్నది. అంతటికి కృష్ణుడేదిక్కగునుగాక హాకృష్ణా! హాకృష్ణా!

చ॥ సరసములై ఘనంబుగ విశాలములై ద్యుతికున్కిపట్టులై
శరజములై తపస్విజనజాలములందు కృపారసంబులై
విరివిగ తేటలైన యదువీర త్వదీయ దృగంబుజంబులం
గరుణనువిచ్చిచూడుమ యనాథను గోరితినిన్ను వల్లభా!

(నడయాడి) అయ్యో! భగవంతునకేగాక—తక్కినవారికెవ్వారికి గూడ నాయందించుకేనియు దయలేకపోయెగదా!—అయిన జెప్పిచూచెదను.

తే॥ శుకనికాయంబులార! కింశుకములార
పికసమూహంబులార చంపకములార
కంబుగళులార చిన్ని మృగంబులార
నెమ్మి నావల్లభుం గూర్పు డమ్మలార!॥

(ఇంకొకచాయ దిరిగి)

తే॥ కంజతతులార ప్రావృట్పికంబులార
బంభరములార కదళికంబంబులార
సరళనికరంబులార కంధరములార
వల్లభుని నాకుగూర్పుడు వల్లులార! ॥

హేరమణా!—అబలనగు నామీదనాకీకోపము. నిన్నుమగనిగా తలంచికుందుచుండు నాపైననింతయు దయారసంబుజల్లరాదా! క్రూరశత్రురాలివలె జూచుటేల? (ఒకచాయపరికించి) అదుగో— ఎవ్వరిదో-కాలిచప్పుడు వినవచ్చుచున్నది. బ్రాహ్మణుండేమో

సఖి—(ప్రవేశించి) దేవీ! ఆలోచించుటపూర్తియైనదా?

రుక్మిణి—(తనలో) అవును. నిర్భాగ్యురాలవగు నాకు సందేశముగాని

పోయిన విప్రునినింతలో దర్శించుటగూడనా! (ప్రకాశముగా) చెలీ! యేలవచ్చితివి ?

సరో—అమ్మా! మీయన్నయగు రుక్మియు అమ్మగారును, నాయనగారును మాట్లాడుచు నిన్నుఁబిల్చికొనిరమ్మన్నారు.

రుక్మి—ఎందులకు ?

సరో—శిశుపాలుడు బంధుమిత్ర పరివారజనంబులతో- తర్లివచ్చినారు. అంతట రుక్మివారికిదగు మర్యాదలుచేసి విడిదింట్లు జూపినారు. నీవు జాగుసేయుటకరమ్ము. (నిష్క్రమి.)

రుక్మి—(దుఃఖముతో రొమ్ముబాదుకొనుచు) కట్టా!- పాపిదైవమా! ఆ నరాధముని, ఆపిరికిపందను-ఆహీనుని-ఆమధుసేవకుని-ఆప్రమత్తుని- నాకయిష్టుండగు శిశుపాలునిగూడ నిప్పుడేదెచ్చితివా! ఓదైవమా! నీబిడ్డయందు నింతకల్మషహృదయమెందులకు! ఓభవానీ! నీవుమున్ను శివునికొరకు నావలెనే కృశించితివిగదా! ఇప్పటినాయవస్థనేల దెలసికొనవైతివి! ఓభరతఖండమా! సనాతనకాలము నుండిజనుదెంచు స్వయంవరముల నేయేటగలిపితివి. ఓదేశభక్తులారా! ఓదేశనాయకులారా! నావంటిదిక్కుమాలిన పడంతులకయిష్టులగు భర్తలనంటగట్టుడని యీ మీప్రబోధములు— (ఆగి) అవును. మీతుచ్ఛవర్తనములు—మీపోకులు—మీపట్టులు—మీద్వేషములు—మీపరస్పరాసూయలు—మీమదహంకారములముందు నాప్రార్థనలు వినుటకవకాశముండునా!— ఉండదు. దేశోద్ధారకనామములకు బదులుగా—ఆర్యమతనాశనోద్ధారకులరని బిరుదులుతగిల్చుకొనుడు. అంతట మీస్వభావములే క్రూరములుగనుక - యేకృషిచేయుటయే—సరిపోవును. ఈకలికాలంబున దేశసేవకాది నిష్ప్రయోజనమైన బిరుదులకు తక్కువేమి ! (దుఃఖముతో) హాకృష్ణా లగ్నకాలము గూడ—దగ్గరకువచ్చినదిగదా! నామనోవాంఛ లేలదీర్చవు!! (ఆలోచించి) నిజము—నీయందేమిదోషమున్నది. తనంతటతాను వలచిన కాంతచుల్కనయగును నారోక్తియేల నిష్ప్రయోజనమగును.

(ధైర్యముతో) ఏలనీలీల వాపోవుచుంటిని. బ్రాహ్మణుండు సందేశంబుగొని చనినాడుగదా?—నాగతినుడివిన వాసుదేవుండంగీకరించకపోవునా!— అంగీకరించును. అంతకు వరింపనిచో—ప్రాణత్యాగము జేసికొనెద.

(తెరలో-రుక్మిణీ! లోపలికొక్క-సారిరమ్మ)

అరుగో తల్లిగారు పిల్చుచున్నారు. (అని నిష్క్రమణము.)

5 వ రంగము.

సభామంటపము.

ఆసనాసీనులై-భీష్మకుడు-కమల-రుక్మి-రుక్మిణి ప్రవేశము.

రుక్మిణి—(తిన్నగా) తల్లిదండ్రులారా! యింతకునేను జెప్పుమనవిని వినరుగదా!

భీష్మ—తల్లీ! పెండ్లివారువచ్చి విడిదిండ్లదిగియున్నప్పటికిని నీబుద్ధిమారకపోయెను.

రుక్మి—మారక పోయెనని తిన్నగా జెప్పెదరేల! ఇంతకు మీదురోభ్ధయే రుక్మిణి యింత హద్దుమీరి పోవుటకు కారణ మగుచున్నది. చూడుడు.

తే॥ పలుకులాడిన చూతము ఫలములిడునె
రాలచేగొట్టకున్న నాలీల రుక్మి
ణికిని తీయనిమాటల నికుక్కవముగ
మనసు తిరుగదు తిరుగుదండనముచేత.

మరియు నాలించుడు.

తే॥ అలదిగీశుల తన మానసాంబుజంబు
నందువరియించక యె దమయంతిమున్ను
నలునిచేబట్టి ఘోరవనంబులందు
గాసిగాంచిన మాడ్కినిగాంచు చెల్లి.

కమల—కుమారా! మేము సీతలవు ననుసరించియే చైద్యుని వరింపు మనుచు నెన్నియో జెప్పితిమిగాని మాబోధలన్నియు నిష్ప్రయోజనమైనవి.

భీష్మ—అమ్మా! రుక్మిణీ! నీకీబుద్ధిజెప్పితిమని మీయన్న మా యందెంత క్రోధమనస్కుడై చరించుచుండెనో చూచితివా! (కనులనీరిడి) రుక్మిణీ!

తే॥ మన్మథాకారముగలాడు మహిగలాడు
కమల కరుణాకటాక్షంబు గాంచినాడు
తక్కువేమియులేదు నిందలచినాడు
గేహినిగ—పట్టుమా చైద్యుకేలు తన్వి॥

రుక్మిణి—(తనలో) దుర్మార్గా! రుక్మీ! తల్లిదండ్రుల మనంబునుగూడ ద్రిప్పివేసితివా! మీరెన్నియన్నను నామతి వాసుదేవునినుండి మరల్పను (ప్రకాశముగా) జనకా! నా కీవియన్నియు నుడువనక్కర లేదు. (మొగము ద్రిప్పును)

రుక్మి—రుక్మిణీ! నీయందుండు వాత్సల్యముచే నింతగా జెప్పవలసివచ్చినది నామాటవినుము.

మ॥ సగలన్, నానావిధంబులం, ప్రియాళిచయముం, నానాగ్రహారంబులం
దొరకుంజీరెల, పట్టుజాకెటుల సంతోషంబుతో నిచ్చెడన్
జగదీశుండగు చైద్యుకేల్గొనిన నో శాతోదరీ! కాక యా
పగతుండైన యశోదజాతుని వరింపం గాంచ నీ మోమికన్.

రుక్మిణి—(తనలో) కట్టా! ఈ చీరెలు—ఈ నగలు—ఈ మాడలీయుమని యెవ్వరడిగిరి. అన్నిటికి బదులుగా—నా ప్రియుండగు గోపాలకృష్ణునిగూర్చిన జాలును. (ప్ర) అన్నా! నాకేమియు నక్కర లేదు. నామనోహరుండు చాలును చూడు.

సీ॥ శ్రీరాము జతగూడి సీతావధూటి ఘోరారణ్యముల నడయాడ లేదె!
వరరుచితో ప్రియంవద పూతచారిత్ర బాముల నెన్ని యోపడగ లేదె!
త్రైశంకుతోడ చంద్రమతీ చలామణి బడ రానియిడుమల బడయ లేదె!
అలపురూరువుతో జయప్రద నలునితో దమయంతి గహనమందంగ లేదె!
ఆ వడంతులు, భోగమందాసగలిగి
విధురములు, రాగభర్తల విడచినారె

యట్టి—నీవన్న చీరెలందాసతగలి
విడతునే నా మనోహరు విడువ విడువ.

భీష్మ—(తనలో) అయ్యో! ప్రస్తుత కాలమందేమిసేయుదును. నాకేమియు దోచకున్నది.

తే॥ వాసుదేవునిదక్క నే వరునిగోర
నంచు దీక్షను బూనె నీయతివమిన్న
చైద్యునకుదక్క నెవరికొసంగనంచు
గట్టిగా పట్టుబట్టె నీకఠిను డకట.

భగవత్సంకల్ప మెటులున్నదోగాని—నాకు మాత్రమిప్పుడు, ముందు నూయి, వెనుకగోయిగానున్నది. దుర్మార్గుడు—దుర్మార్గుడు—చైద్యున కిచ్చునట!

ఉ॥ ఎందరు చైద్యులైన మరియెందరు మాగధులైన నింక నిం
కెందరొ సాళ్వులైన—సికనెందరు పౌండ్రకులైననేమి! గో
విందుని—వాసుదేవు నరవింద దళాక్షుని పోలరక్కటా
మందుడు—రుక్మి—రుక్మిణిని మానడు చైద్యునకీయ దైవమా!

రుక్మి—తండ్రీ! మనమొకవేళ రుక్మిణిని యాదవునకిచ్చిన శిశుపాలుడూరకొనునా!

రుక్మిణి—ఊరుకొనక యేమిచేయును?

రుక్మి—ఏమిచేయునా! తిన్నగా అడిగెడ వేమి! దురంబున పదునాలుగు లోకములు సహాయము గా వచ్చినను, మనల తెగటార్చడా!—

రుక్మిణి—అన్నా! నన్నివ్వనందున—శిశుపాలుడనికివచ్చు ననిగా నుడువుచుంటివి, నన్నొకవేళ మీరు బలాత్కారముగా చైద్యున కిచ్చిన యెడల—నేను ప్రేమించినది తెలిసియుండిన కృష్ణుడుమాత్రము రణముసేయక నిన్ను, నీమిత్రుల వదలుననుకొంటివా!—

రుక్మి—సోదరీ! నీయుక్తి సహేతుకముగానే యున్నది కాని—వాడు మనలదాకినను, గెల్చుటకు వానికి తరముగాదు.

ఆ॥ వె॥ గుణములేనివాడు గొల్లండు హీనుండు
వావివరుస లేనివాడు జాతి

నీతిలేనివాడు నీచుండు మావంటి
బలుల దురమునందు గెలువగలడె.

రుక్మిణి—సోదరా! ఆమహాత్ముడు నీచుడా!

సీ॥ తిలకింపగా గోపకులు, గోపకులుగారు సదయాత్ములైన నిర్జరులుగాని
తిలకింపగాగోపికలుగోపికలు గారు,విమలహృదయులు సంయములుగాని
బలరాముజూడగా బలరాముడా కాదు, శుభ్రవర్ణుండు శేషుండుగాని
పరికింపద్వారకాపురి ద్వారకయుగాదు, కరమగు వైకుంఠపురముగాని
మనుజమాత్రుడె! దేవకీతనయుడరయ
ధరణిభారంబుదీర్ప ముష్కరుల నడచి
సజ్జననికాయమునకు హర్షంబొసంగ
నవతరించినయట్టి దైత్యారిగాని॥

అన్నా! అన్నా! నన్నేంకుల కేష్పించెదవు. మనసార నొకనివరించి మరల నింకొకరిని గోరుట పతివ్రతకు లక్షణము కాదుగదా! ధర్మశాస్త్రమునకు కడుంగడు దూరముగదా! ధర్మాధర్మములు తెలిసినవాడవు. రాజ్యభారము మోయుచున్నవాడవగు—నీవే యిట్లు వక్కాణించిన, నిక ప్రజలు ధర్మమెట్లాచరింతురు! నీవుచెప్పిన నీతియే విన్నచో—మగలతో కాపురంబుసేయు మగువలు సైతము తమ మగలవీడి పరపురుషులగైకొందురన్న సందియమేమియున్నది.

రుక్మి—(కోపముతో) ఏమీ పాతకీ! నీమోమింక చూడదగదు చూచిన మహాపాపంబులు సంభవించును. (తలనూచుచు) ఇదియంతయు—నిన్ను బ్రతిమాలుటచే వచ్చినది. మా యిష్టముగా నొనర్చు వివాహమునకు నీయడ్డేమిటి! —స్వయంవరము కాదుగదా! (నడచును)

రుక్మిణి—(అడ్డముజని) అన్నా—నీముద్దు చెలియలనగు నాపైనా నీ కోపము! నీవంటి యుత్తమ క్షత్రియుడు ఆడుదానిపైనా మగంటిమిజూపుట (ఆగి) అవును, మహాభయంకరమగు, సమరక్షోణీతలంబున!—నీవంటివారలు వెనుకంజవేయుటయే గాని—ముందుకు పోనోపరుగదా!—నేను బాల్యమునునుండియు, కృష్ణుని

గాక యింకేరిని వరియించనగిలోక్కి నుకుపుచున్నను నాప్రార్థ
నలబెడచెవిని బెట్టుచు, నీక్రూరునకీయదలంచి యింతవనిజేసితివి!

రుక్మి—(పండ్లుగొరుకుచు) ఓ తల్లిదండ్రులారా! నేనుపిరికిపందననియు, క్రూరుడననియు నించుకయేని భీతిలేక శాత్రవపక్షమువహించి నోటికడ్డులేక వాగుచున్నది. ఇంతవరకు— చెల్లెలనియూరకొంటిని గాని— ఇకమదీయ హృదయమునిలువదు. (కోపముతో) ఓసీదుర్గుణఖనీ! రుక్మిణీ!

ఉ॥ చెల్లెలివంచునాచితినిసీ:— యికమీాద సహింపబోనునిం
జెల్లరె కట్టిపెట్టుమిక చెల్లెరొ వాగుడు పూజ్యుచైద్యుపై
నుల్లమునిల్పి కేల్గొనుతలోదరి! భర్తయువీడెనీకు నా
గొల్లనికీయబోము తుదకుంగడుకష్టములో సహోదరీ॥

నీ వెంతయేడ్చినను—శిశుపాలునకుదక్క— కృష్ణున కీయదొడగను— ఇదినిశ్చయమని వేదప్రమాణముగా— మనంబుననిశ్చికొని వాంఛలువీడి చైద్యునికేలు గ్రహింపుము.

రుక్మిణి—(పెదవివిరుచును)

(తెరలో— అయ్యా తమరొక్కసారిటు దయచేయుడు శిశుపాల మహారాజగారు బిల్చుచున్నారు.)

రుక్మి—ఇదుగోవచ్చుచున్నాను. (అనినిష్క్ర.)

భీష్మ—సతీ!

సీ॥ కటకటా కొడుకులు కలుగలేదంచును గుందుచునుందురుకొన్నినాళ్ళు
కొడుకులుగల్గగా కుడువలేదంచును గుందుచునుందురుకొన్నినాళ్ళు
కుడువనుండగ విద్యబడయరటంచును గుందుచునుందురుకొన్నినాళ్ళు
విద్యయబడయగా వినయంబులేదని కుందుచునుందురుకొన్నినాళ్ళు
తరచిచూడంగ నిట్టులేధరణియందు
సుతులబడసినవారికి వెతలుమెండు
సుతులబడయనివారికి గతులులేవ
టంచుదెల్పుదురద్ది సత్యంబుగాదు॥

గడుసుకొడుకుచే మిగులమనోవ్యథగల్గి బాగులుచున్న మనమే యిందుకు తార్కాణము.

కమల—నాథా! మీరన్నట్లు యిటువంటి మూఢుల తనయుల గాబడసినతల్లిదండ్రులు దుఃఖవంతులుగాక సుఖవంతులగుదురా (కంటినీరుదుడుచుచు) అమ్మా రుక్మిణీ! ముదుకాళ్ళము దుసలులమై యున్న నీ తల్లిదండ్రులమాటలాలించి చైద్యునే మగనిగా వరించి కొన్నిదినంబులు మీ శుభోచ్ఛ్రయంబుల గాంచజీవించదలచిన మమ్ముల చింతలపాలుజేయకుము.

రుక్మిణి—అమ్మా! అన్నకుబట్టినపిచ్చి నీకుగూడగల్గినదాయేమి! అధర్మమునాచరించుమని చెప్పుటమహాదోషముగదా?

భీష్మ—భగవదనుగ్రహ మెట్లులున్నదట్లగునుగాక. గృహాంబులోపలికేగి ప్రస్తుతకార్యమాలోచింతము. (అందరు నిష్క్రమింతురు.)



శ్రీరస్తు

# రుక్మిణీసందేశము.

## తృతీయాంకము.

ప్రథమరంగము.

రుక్మిణి—(దుఃఖముతో రొమ్ము బాదుకొనుచు) హాకృష్ణా, హావసుదేవ తనయా, నామొరాలించి, నన్ను గ్రహించెదవని తలంచితిగాని, యిప్పటికీవు రక్షించవని నమ్మకముగా దోచుచున్నది. ఆ ఆ ఏమి ! వాసుదేవుడు, నన్నురక్షించడా? ఏలరక్షించక పోవును, రక్షించును. అయ్యోకాలమా ! నాయందు నీకింతపరాకేల? (క్రోధముతో) ఓరీ శిశుపాలా, నిన్ను ప్రేమింపక యితరుని గోరిన నన్నువివాహమాడుట మాత్రము నీకేమిఘనము, నీతుచ్ఛవర్తనముజూచి, వాసుదేవునివంటి యుత్తమక్షత్రియులు నగుదురని యేలతలపోయవైతివి. (తొట్రుపాటుతో) హాకటకటా, కృష్ణా, ఈవిరహసాగరమందొక బిందువునై దరితోచకయల్లాడుచున్నాను.

సీ॥ వదునాల్గులోకముల్ భరియించిదివిజాళి జల్లగాగాచిననల్లవాడ
మందరాచలధరా! సుందరాకార! యావన్నివారక నందుజిన్నివాడ
సంతతానంద కంసవిదారి సుగుణాకరా! వసుందయుగావుమంటిత్రేశ!
వైకుంఠ! సర్వేశ! పాకారివినుత పాదద్వయాగోమినీతరుణిజోడ!
నెనరుగలవాడ! భక్తులమనుచువాడ!
శీర్షమందు కలాపముల్ జెలగువాడ!
ధర్మనిరతిగలాడ వైదర్భినిపుడ
జూడరా సద్దయాత్మ నాజోడప్రోడ! ॥

అయ్యో నా దేహంబంతయు, జల్లబడి, బలహీనమైనది. ఇస్ అబ్బా! ఇంతవరకెటులో ప్రాణము నిల్పుకొంటినిగాని, యికజీవించుటదు స్తరము.

ఉ॥ బంధుజనంబుతోడ; గనువందువుసేయు రథాళితోడ ; గ
ర్వాంధులు దంతవక్త్ర శిశుపాల విదూరక సాళ్వులున్ జరా
సంధుడు, రామకృష్ణులను సంగరమందుజయించి న న్కటా
బంధనమందునుంచి పరిపంధులరై గొనిపోవవచ్చిరా॥

(నడయాడి) దేవా! దేవా! అందరియందుండు వాడవనియు, నాపద్బాంధవుండవనియు, పురాణములు ఘోషిల్లుచున్నవిగాని యిప్పటి నీకఠినముజూడ నీకంటె వ్యాధుడే దయగలవాడనిపించుచున్నది. (దుఃఖముతో) ఏమిది- నాకుస్మృతి దప్పినదాయేమి, ఇదివిదర్భగాదా, యిప్పుడు నేనెందుంటిని, యంతఃపురములోనుండలేదా, నేనుజీవించియే యుంటినా, ఏమిది- నాకనులకేదియు గోచరింపక చీకట్లుగ్రమ్ముచున్నవి. నాసంగతియే నాకుదెలియకుండ బోయినది. హానాధా, హానాధా, అనాధులగాచెడివాడవు నన్నేలనేలవు, నాకెవ్వరును దిక్కులేరు. కృష్ణా, చిన్నతనమునుండియు, నిన్నేవరించితిగాని మరియేరిని గోరియెరుంగను. నావండువంటి వయస్సంతయు నీకే యర్పించుకొంటిని. అయ్యో అయ్యో దైవమా, నాకేల నిట్టికోరిక గలుగునట్లు జేసితివి, చేసితివిపో- యదినెఱవేరునట్లనుగ్రహింపక నన్ను మోహసాగరములో నొక నల్లవూసగా జేసితివా,

శా॥ కట్టా, ద్వారక జేరెనోద్విజుడు మార్గంబందునే జిక్కెనో
గుట్టుందెల్పెనొ, లేదొ, తావినియు సంకోచించెనో, నేలరా
పట్టిందెచ్చెద నట్టులేని యనెనో పాటించెనో లేదొ చే
పట్టందల్చెనొ దల్చడో ధవుడు నాప్రారబ్ధ మెట్లున్నదో॥

(కన్నీరుదుడిచికొనుచు) హా యగ్నిద్యోతనా, నాకొరకెంత కష్టము పడుచున్నావోగదా, (ఆలోచించి) అయ్యో, నేనేల నామఃసబ్రాహ్మణునిబంపితిని. అతండు, నడువలేక మార్గమధ్యమం దెచ్చటజిక్కివిలపించి మరణించెనో, (ధైర్యముతో) అట్లుజరుగనేరదు. మహానుభావుండగు వాసుదేవుని సత్కృపారసంబుండిన భయంబేమి, (ఆగి) అయ్యో, అమ్మహా

త్మని కృపారసంబు బడయునంత పుణ్యురాలనా, ఆగీతయేయున్న నిప్పటికే నావాంఛ తీరియేయుండును. (పరికించి)

సీ॥ కళ్యాణి! నేగోరు కాంతుని దెచ్చిన ముత్తెంపు పేరులు నిత్తు నీకు
కనడాయెనను సద్దయను కినుకఁబూనెనో మనసు ద్రిప్పుమని నీవు మధురవాణి
మోహనాకారి నామోహనాకారుని గూర్చినవిత్తంబు గూర్తు నీకు
భాగీశ్వరీ నాదు ప్రాణనాధుడు నన్ను వలచెడి మార్గంబు పలుకు సదయ
జాంగలప్రియుహంతకు జాలమేల
తోడిసఖులార దోడ్గొండు తోయజాస్యు
డు వనజాతంబులేసె బారువడిబెట్టి
శరమునుంబట్టి భూపాలు నరయుడింక॥

సరో—(ఆతురతతో ప్రవేశించి) అమ్మా, శిశుపాలుని పెండ్లికొడుకుగా జేసినారు. నిన్ను స్నానము జేయించి చీనాంబరములుగట్టిపెట్టి గౌరీ పూజకు తీసికొనిపోవలెనట. కావున తొందరగా రమ్మా. వేళ యతిక్రమించునని మీయన్నగారు చాలా హడావుడి పడుచున్నారు. (ఆలించి) అవిగో-మంగళవాద్యములు మ్రోయుచున్నవి (నిష్క్రమించును).

రుక్మిణి—(క్రిందపడి) అయ్యో గౌరీపూజచేయుటకుగా బాలు జలకమాడుటకు రమ్మనిపిలుచుచున్నారు. ఇంతవరకా వాసుదేవుడు వచ్చినజాడ రానిజాడ తెలియలేదు. (ఏడ్చుచు) ఎటులైన నందరుగలసి నన్ని శిశుపాలున కంటగట్టుదురని భయంబగుచున్నది. హాకృష్ణా!

మ॥ వనజాక్షా! హితబంధుసంఘములతో బాగైనభృత్యాళితో
ఘనరథ్యంబులతో రథావళులతో కర్ణామృతంబైన శం
ఖనినాదప్రకరంబుతో ద్విరద సత్కాండంబుతో వచ్చి యు
న్నను గైకొందువటంచు నెంచితి మహానందంబుతో నింత ము
న్నదఘా! లగ్నము వేళమీరియును కళ్యాణంబు డాసెగటా॥

చిత్తమా, ఏల వలుమారులాలోచించుట. (నగుచు) మహానుభావుండగు వాసుదేవుండు రాక్షసవివాహమున నేడెగదా! నన్ను గొని పోవును. రేవు యిదివరకు ద్వారకానగరంబులో యంతపురసీమల, కృష్ణ

నితో హంసతూలికాతల్పంబుల కేళీవిలాసంబున జరియించెదగాబోలు. (దుఃఖముతో) అయ్యో, అంతటిమహాభాగ్యమా, (ఆలోచించి) ఏమది, శుభశకునంబులగుచున్నవి.

కం॥ ఎడమ కన్నదమతోడయును
పుడమియుఁ దరినట్టులైన ఫాలతిక శుభముల్
వడిగల్గు ననెడిపెద్దల
కడుఁబ్రియముగుమాటకల్ల గాదౌనె గనన్॥

ఇదిగో-కనులనుండి హర్షాశ్రువులు గారుచున్నవి. మదియంతయు కలఁకలబారదోలి సంతోషముఁ గాంచుచున్నది. (అటునిటుచూచి) ఆహా, గోపాలుఁడు-నా బాహ్యాంతరమందుండి చెక్కులనొక్కుచు నధరామృత మానుచు జిలిబిలిపల్కుల పల్కుచున్నట్లు కనుగవకు గనుపించుచున్నది. (చిరునగవుతో) కృష్ణా ! రమ్ము. మోహనకరమ్మగు నీ రూపమ్ము జూపుము. (ఆగి) అవును. సంతతము వానియాకారము జూచుచు జూచి నంతనే హర్షాశ్రువుల నింపుచు, బిగ్గకవుంగిలింతల జేర్చుచుండియు, విచారమందనేల! మనసా! ఎల్లకాలమిట్టి సంతోషమునే దలంచుము. అధైర్యములపాలుగాకుము. నీవు వాసుదేవుని బ్రేమించుచుండిన, నాతఁడు మాత్రము మేలుఁబ్రేమింపఁడు? తప్పక ప్రేమించును. (కనులార్పక చూచి) మనోహరా! నీజగన్మోహనాకార మెంతరమణీయము ? నీ ప్రియురాలియందు నేటికి దయవచ్చినదా! (కరములుమోడ్చి) హా కృష్ణా! భక్తవర్ధిష్ణా!

చ. అడవులలోన జేరి పవనాంబుఫలాదుల నారగింపుచున్
కడుమదిభక్తితో తపముగాసిలకోర్చి, యెవరు తాపసుల్
బడయగరాని నీదగు కృపంగనుగొంటి ఫలించెనోము లో
వడిగలవాడ ! యింక కరపంకజముం గ్రహియింపువల్లభా॥

(సంతోషముతో) మారా ! నీపొగరిక యణచెదనులెమ్ము, నా ప్రాణనాథుని కృపారసంబు నాపై జనుదెంచుచున్నయది. హాదీనబంధూ! (మూర్ఛిల్లును)

అగ్ని—(ప్రవేశించి) అమ్మా! రుక్మిణీదేవి !

రుక్మిణి—హా కృష్ణా ! హాకృష్ణా !

అగ్ని—అబ్బా! యేమీసాధ్వీలలామంబు, తన పట్టువదలక తల్లిదండ్రుల మాటల నిర్లక్ష్యముతో జూచుచు, తను గోరినవాడు, భగవదంశ సంభూతుండని నమ్మి కృశించుచున్నది. (కన్నార్పక చూచి) ఓరా! యేమీ సౌందర్యము!

చ॥ విరిసిన మెట్టుదామరయు, విద్రుమ చంపక మౌక్తికంబు కే
సరకుసుమంబు, మాలతియు సత్ఫలపుల్లము కెంపుకుందముల్
దిరిసెనపూగుళుచ్ఛములు దీటుగబోలగ లేవు లేమవా
తెరసుమనోజ్ఞ వాసనల దివ్యయుగంబులు పోల్చిచూచినన్॥

ఆహా! ఈ సహజసౌందర్యవతికి తగినట్లు సుకుమారుండగు గోపాలకృష్ణుని కూర్చినటువంటి సృష్టిచాతుర్యము పొగడగావలసినదే యగును. అమ్మా! రుక్మిణీదేవీ! దేవీ! (అని పిల్చును)

రుక్మిణి—హా కృష్ణా! హా కృష్ణా! (అని లేచి) ఇమ్మహాత్ముని ముఖపంకజము జయము సూచించుచున్నది. అయినను భగవంతుని యనుగ్రహమేలాగున నున్నదో గదా! (ప్రకాశముగా) స్వామీ! అగ్నిద్యోతనా! వందనములు.

అగ్ని—కళ్యాణప్రాప్తిరస్తు.

రుక్మిణి—(తనలో) ఇంతకుముందు గనుపించిన శుభశకునంబుల ఫలితము దేలుచున్నది. మరియు నరసెదగాక! (ప్రకాశముగా) తండ్రీ! మీరు పోయినపని యేమయినది?

అగ్ని—తల్లీ! రుక్మిణీ! నీవద్దనుండి సందేశముగొని యేగినప్పటినుండియు జరిగిన వృత్తాంతము జెప్పెద నవధరింపుము. నే నిచ్చట బయలుదేరిన దివంబు సాయంతనమునకే ద్వారకాపురి జేరితి, ఆహా! ఆపురంబు కడురమ్యంబు!

సీ॥ చంద్రశాలాగ్రముల్ శ్వసనువర్త్మనుదాక ప్రాసాదసౌధముల్ రహిజెలంగ
పానీయశాలికా వాజిశాలావళి, కుట్టిమహర్మ్యముల్ కూర్మినింప
సంజవనంబులు చైత్యమానీకముల్, కనుదమ్ములకుహర్షమునునొసంగ
ప్రమదావనంబులు వరణజాలంబులు, వీధులునెమ్మది వేడ్కనొసగ

మేనకాదులజవముస మేలమాడు
గానవిద్యాప్రవీణలు గణికలచట
నాపురీవర సౌందర్యమహహ యెన్న
తలముగాదల వేనోళ్ళఁబలువకైన॥

రుక్మిణి—అవును. అమ్మహాత్ముఁడగు కృష్ణుండుండిన నెట్టిదా వైనను, మహాసౌభాగ్యలక్ష్మిని గోరుచుండును. తరువాత—

అగ్ని—అమ్మా యేమనిచెప్పుదును. తరువాయి వినుము. అంతటవాసుదేవుని నగరద్వారంబు దర్శించితిని. బంగారుసీరుబోయించిన ద్వారబంధములును, చంద్రకాంతమణులు దాపినయరుగ ద్దెలును, పచ్చనితోరణములచేరాజిల్లు ప్రధమద్వారంబుగాంచి, యచ్చట కావలివారలచే నాజ్ఞనుగొని, దానినిగడచిచని, సౌభాగ్యలక్ష్మికునిక్కపట్టులైగ్రాలెడు యూరు కవాటంబులదాటి యేడవద్వారంబుగాంచితిని. అక్కడ—

తే॥ కానుకలగొని, గజతురంగములగొనియు
వాసుదేవునిదర్శించ, వచ్చియతని
దర్శనముగాక యెందరో ధరణిపతులు
వాకిటనెయున్నవారలు వారిజాక్షి ॥

రుక్మిణి—(సంతోషముతో) అవును. ఆజగదీశునకు తక్కువయేమియున్నది. తరువాత.

అగ్ని—అంతట నాదవ్వారికులచే నాజ్ఞగొని లోపలికిజనిచని, సర్వఫలాకరంబును, హర్షకరంబగు నొక్క ప్రమదావనంబుగంటిని, అందు దేవేంద్రు పీఠమును ద్రుణీకరించుచు, నవరత్నమణి విరాజితంబగు నొక్కసింహాసనంబు జూచితి. దానికి కొంచెముదూరము లో— నీలమేఘశ్యాముండును —శతపత్రాక్షుండగు వాసుదేవుండొక ప్రసూనంబుజేతబట్టి, యాహా దీనినెవ్వారికొసగుదునని యాలోచించుతరి, నేనాతనికెదుట గనుపించితిని. అంతనాతడు సభక్తితో నమస్కరించి, స్వామీ !—యేలవచ్చితిరని ప్రశ్నించెను. అంతనేను సందేశంబుచెప్పితిని.

రుక్మిణి—(భయసంభ్రమములతో) అంగీకరించెనో లేదో గదా !

అగ్ని—అంతటనాతడు సంతోషముతో చిరునవ్వునవ్వి అగ్నిద్యోతనా ! యింతకుమున్నె—యావడంతి శీలంబును, లావణ్యాగణంబును, నన్నువరించుటవిని కన్నువిల్తుకోలలజిక్కి యహర్నిశాదులు నిద్ర వదలి హా రుక్మిణీయని విచారించితినని చెప్పెను.

రుక్మిణి—తండ్రీ ! నావివాహము నేడేగదా ! నానాథుండువచ్చెనా !—

అగ్ని—వచ్చుటేమిటి !—ఇద్దరమును కలసియేవచ్చితిమి. ఆతనికి మర్యాదలుచేసి భీష్మకుడు వసతిగృహంబుజూపెను. అంత నే నీసమాచారము నీతోనుడువజనుదెంచితిని.

రుక్మిణి—(సంతోషము తో) ధన్యోస్మి. ధన్యోస్మి. తండ్రీ !

చ॥ విరహపయోధిమున్గి మరువేదనకుం గృశియించుచుండు న
న్నరసియు, నాదువాక్యముల నాహరికిందగజెప్పి తోడనా
వరమతిగూడి వచ్చితివి బాడబ, ప్రత్యుపకార మక్కటా
ధరణి నొనర్పలేనికను దండముపెట్టెద గాంచుమా దయన్॥

(పాదములంటును)

అగ్ని—అమ్మారుక్మిణీ, నాకేమి యొసంగకపోతివని మనంబున విచారింపకుము నీవుకోరిన మహాభాగుండగు కృష్ణుని దీసికొని వచ్చితిని. నాకిదియే మహాసంతోషము. నీవు లక్ష్మిస్వరూపురాలవుగా దెలిసికొనుచున్నాను. బీదవిప్రుడనగు నాపై కటాక్షంబుంచుము.

రుక్మిణి—జనకా, నీవుచేసిన యుపకారమున కెంతయు కృతజ్ఞురాల. నిన్ను నాపాలిదైవముగా ధ్యానించెద.

అగ్ని—రుక్మిణీ! అనుగ్రహముంచుము. పోయివచ్చెద (నడచును).

రుక్మిణి—తండ్రీ! మాట. గౌరీపూజకుముందుగా నొకసారి యాతని దర్శనమిమ్మని ప్రార్థించితినని చెప్పుము.

అగ్ని—తల్లీ అటులనే. పోయివచ్చెద. (నిష్క-9.)

రుక్మిణి—ఆహా, ఈదినమే సుదినము. నామనోహరుని కౌగిటజేర్చి యీప్సితంబులదీర వీక్షించెదనుగాక. వాసుదేవునికి సంపూర్ణ జ

యంబగుగాక (పరికించి) అదిగో- తల్లిగారు పిల్చుచున్నట్లున్నది. పోయివచ్చెద.

(నిష్క్రమించును)

## రెండవ రంగము.

బల—(ప్రవేశించి)

చ॥ దురమున రుక్మిణింగొనియు తోయజనేత్రుడు పోవునంచు సం
బరమున దంతవక్త్రుడును పౌండ్రక సాళ్వవిదూరకాధిపుల్
పరమసహాయులయ్యు శిశుపాలునకుం జనుదెంచినారు సో
దరునకు దోడునేగెద విదర్భముకుందుడు జేరునంతలోన్॥

(ఆలోచించి) జయాపజయంబులు విచారింపనేల, విష్ణ్వాంశసంభూతుండగు కృష్ణునకు జయమగుగాక. వేళ యతిక్రమించుచున్నది. నాకొరకెదురు చూచుచుందురు. (నిష్క్రమి.)

## 3 వ రంగము.

ప్రమదావనము.

విలాసగృహము. రుక్మిణి సరోజినులు ప్రవేశము.

రుక్మిణి—సరోజనీ, చంపకములను గొనివచ్చితివా?

సరో—దేవీ, తెచ్చితిగాని నేడు పూలతో వాల్జడ వేసికొనిన బాగుండునని నాయూహ.

రుక్మిణి—సరికాని నామనోహరునకు హారముగా వేయుటకు పలురకములుకల్గి సౌరభము వెదజల్లు కుసుమంబుల నొకచక్కని పేరుగా తయారుజేయుము.

సరో—రుక్మిణిదేవీ, ఏల నీలీల నుడువుచుంటివి? నాడు శిశుపాలునివరింపుమనిన చీకాకుతో గసరి నన్ను గొట్టవచ్చితివిగదా, నేడేలనాతని యందింత యనురాగము కలిగినది. (ఆగి) అవును, నీవు ప్రేమించిన కృష్ణునకీయక మీాయన్నయుంటచే నెట్లైన చైద్యునకని, తలంచి, పాపము- ప్రేమించితివి కాబోలు.

రుక్మిణి—(మారొమ్మోగము వెట్టి)

తే॥ వలచినను, వలవకయున్న తలపె వాని
కొరకు చింతించునో వాని గోరదగును
కాని—పెరవారిగోరుట కామినులకు
తగదు తగదిక తగదు ముజ్జగములందు.

సరో—అట్లయిన నీవేల! శిశుపాలు కేలుగ్రహింపనుంటివి!

రుక్మిణి—(కోపముతో) సరోజినీ!—నీవదరు బెదరులేక నోటికివచ్చినట్లు వల్కకుము. నామనోహరుం డీ తుచ్ఛుండగు చైద్యుడా!—

సరో—దేవీ!—నామీాద కోపమేల! నిన్ను బెండ్లియాడ బంధుమిత్రాదులతో శిశుపాలుడు వచ్చియుండ—శిశుపాలుని కాదనదవేల!

రుక్మిణి—అది నిజమేగాని—యొక్కరహస్యము గలదు అదినీకు కొంచెము తెలిసియే యుండునుగాని—మరియెవ్వరికిని దెలియదు.

సరో—అదియేమో కొంచెము మాకుతీయవచ్చునా!—

రుక్మిణి—చెప్పెదగాని—నీవెవ్వరికిని తెలియనీకుము తెలిసినచో ప్రాణసంకటము గల్గును. వినుము. అగ్నిద్యోతనునిచే నా సందేశార్థం బాలించి, కతిపయాప్తులతోడను,—పదాతులతోడను,—కృష్ణుండు జనుదెంచి యున్నాడని విప్రుండింతకు ముందుగా నరుదెంచి, వాసుదేవుని సందేశంబు సాంతంబుగా దెల్పియేగెను.

సరో—అవును మరచితిని అగ్నిద్యోతనుడను బ్రాహ్మణుని నీకడకు నేనే గదా పంపితిని. నీవెంత పుణ్యురాలవమ్మా!

రుక్మిణి—(చిరునగవుతో తలవాల్చును)

సరో—అమ్మా దేవీ! అనేకమంది రాజుల సహాయముగా గొనివచ్చిన చేదిపాలుని యడంచి, యొక్క కృష్ణుడిందరిలో నిన్నెటుల చేకొనును? నేనమ్మదగను!

రుక్మిణి—వెఱ్ఱిదానా!—ఆయనకీ నరాధములనగా నొకలెక్కయా!—చూడుము.

క॥ లోకంబులఁ దనలోపల
నాకఱలెన్నగ యశోద నారీమణికిన్

ప్రాకటముగ జూపిన సు
శ్లోకుడు, పరమాత్ముడతడు శుభచారిత్రీ! ॥

మరియు,

శా॥ అజ్ఞానాటవిదావపావకుడు, దాసాత్మాబ్జవాసుండు స
ర్వజ్ఞస్తోత్ర పదద్వయుండు, కరుణాపారీణుడార్యుండు క్షే
త్రజ్ఞుండర్జును సౌహృదుండు, సుగుణోద్దాముండు కృష్ణుండు నా
లజ్జాళిం గృపగాచువాడు మహదుల్లాసాఢ్యు డజ్ఞాప్తుడే! ॥

సరో—(తనలో) ఈ నాటకమంతయు చిత్రముగానున్నది. తుదకెట్లుగా నున్నదో—ఎట్లయిన మారుక్మిణికోరకతీర్చి భగవంతుడు రక్షించుగాక. (తెరలో—వేణునాదము వినబడును)

రుక్మిణి—(హర్షముతో) చెలీ! చెలి! ఏమాధ్వని!

సరో—వేణునాదము.

రుక్మిణి—(ఆలించి) అవును పిల్లనగ్రోవివలెనే యున్నది. (తనలో) నేను జెప్పినసంగతి భూసురుండు, తప్పక నానాధున కెరింగించియే యుండును. ఏమిది, శరీరమంతయు పుల్కరించుచున్నది. (ప్రకాశముగా) చెలీ! ఆకర్ణామృతంబైన వంశనాళ నినాదంబునకు నెండిపోయినమోడు కిగిర్చినవిచూడుము.

సరో—(పరికించి) దేవీ! నిజము. యీధ్వనిమనకు దగ్గరగానే వినవచ్చుచున్నది. యీ వేణువుబాడు మహాపురుషుం డెవడై యుండునో!

రుక్మిణి—సరోజినీ! నాసర్వాంగములు పరవశమగుచున్నవి. మనోపయోధియందు కళంకతరంగంబులాగి, సంతోషవీచికలు, తామరతంపరాయెను. కనులు సుఖనిద్రజెందనున్నవి. నాప్రియుండగు గోపాలుడునాయెడ— ప్రేమానురాగుడై— నట్లుగాన్పించుచున్నది. హాకృష్ణా హాకృష్ణా! (ఒకచోట నిద్రించును)

సరో—మాదేవినిదురించినది. నేనుగూడకొంచెము విశ్రమించెద. (విశ్రమించును)

కృష్ణు—(ప్రవేశించి) పాపము. రుక్మిణినాయెడ ప్రేమానుబద్ధయై.—నా కొరకన్నమైనదినక— కృశించుచుండెనట— హారుక్మిణీ!

దిగులొందకుము. రుక్మిణి యీవనమునం దుండుననియు.— గౌరీపూజకులోగడనే తనకునన్నుగనఁబడుమని ప్రతిమాలిచెప్పిన దని, విప్రుడునుడివెనుగదా!— నాప్రాప్తము మంచిదైన గనుపించును. ఆహాయేమి వనశృంగారము!!

తే॥ వికసితలతాంతములు మహావేడ్కనొసగ
చికురతమారుతమల్లన జెలగుచుండ
మదళిలీముఖ ప్రాతముల్ రొదలుసేయ
కనులపండువుసేసె నీవనమునాకు॥

(పరికించి) ఎవ్వరోయిచ్చట నిద్దరుస్త్రీలు నిదురించుచున్నారు. అందునెడమచేతివైపున నున్నది దాసి యనియు, కుడివైపుననున్నది యొకరాచకన్యకయని దెలియుచున్నది. ఆహాయేమీ లావణ్యవిలాసము! యీమేనా—రుక్మిణీకాంత. నాబహిప్రాణము. (ఆలోచించి) ఆలోచనేల, అగ్నిద్యోతనుడు కృశాంగనయనిగదా చెప్పెను. ఈమె యేమైయుండును. ఇందేమి యబద్ధముండదు.

రుక్మిణి—హాకృష్ణా, హాకృష్ణా, కటాక్షింపుము.

కృష్ణు—అవును. నిద్రావస్థలోగూడ— నానామస్మరణ చేయుచున్నది. ప్రక్కనజేరి మక్కువదీర కౌగలింతునా,— కౌగిలించుటయెట్లు! నారూపమునుజూచిన— సిగ్గువడునేమో,— అదిగాక— దాసియుగూడ నుండెను. కనుక నదృశ్యుడనయి వారలకెవరికి కనుపింపక రుక్మిణి చెక్కిలినొక్కెద.

(రుక్మిణిప్రక్కకూర్చొని ముద్దిడును)

రుక్మిణి—(లేచి) ఆహాయేమిది కృష్ణా, నన్నుముద్దాడినావు. కాని యింతలోనే మాయజేసిపోతివా, ఎంతమాయకుడవు. (దుఃఖముతో) కృష్ణారమ్ము. నీదాన. నన్నురక్షించెడిభారము నీయదియేసుమ్మి.

సఖి—(లేచిపరికించి) ఆహాయేమీసతీమణి,

తే॥గీ॥ తనదుహృదయంబు దేవకీతనయునిపయి
పూర్ణముగనిల్పి మరుబాణములకునోర్వ

జాలకయయేడ్చుచుండె నీ చానమిన్న
కటకటాదీనులకై వెక్కలుగుచుండు ॥

అమాత్య, నీకు మతిభ్రమయాయేమి, వాసుదేవు డెప్పుడు వచ్చెను. ఎప్పుడుముద్దిడెను, నీపలుకు లతివిచిత్రముగానున్నవి. వచ్చిన గనబడకయుండునా?

రుక్మిణి—ఇప్పుడేగదా నామనోహరుడువచ్చినది. ఆయనస్పర్శవలన నాకు పులకాంకురములు గల్గుచున్నవి.

కృ—ఆహా!

ఉ॥ ఆమఃరిపెంపులేనగవులా కను లానెరు లా కుచద్వయం
బామధురంపుమోవి నుడులాకటి యాగళమాపదద్వయం
బామృదుదేహమా పెదవులాతొడలా వళులా కరద్వయం
బామొగమున్నతింపగ నగాధిపుకై నతరంబె యారయ॥

రుక్మిణి—హాకృష్ణా, నాపైకోపమేల, యీకోపమునకుదగు తప్పేమి యొనరించితిని?

కృ—కోపమేమియున్నది. నిన్ను పెండ్లియాడవలెననియేగదా వచ్చినది.

రుక్మిణి—(చిఱుమఃడిపాటుతో) హామదనా- మదనా!

సీ॥ చిగురుటాకులనొక్కి చంపక కోవెలా యరచదే నీ పాటలడిగిపోను
వలరాజనకును దోడ్పడి పగయైతివా? చిలుకరో నీగుంపు చీలిపోను
చెవులుగింగురుమనుస్థితిగోల జేసెదే భ్రమరమా పూదేనెవదలగలువ
ఎట్లుగన్నెల కన్నెట్లుజేసెదవేల? బాగగునీ సౌరు పాడుగాను
శారికా కినుకయే నీవుసణిగెదేల?
పారిజాతమ యీామిడిసిపాటదేల,
గోరువంకరో నీకింత క్రొవ్వదేల?
గొనుగుచుంటివి యత్రింటి కోడలివలె॥

కృ—ఈ సుందరిసాధ్వియనియే నాభావమునకు స్ఫురించుచున్నది. ఇంక జాగు సేయరాదు. పలుకరించెద, (ప్ర) ఓరుక్మిణీ! భయపడకుము. నీమనోనిశ్చయము గనుగొంటిని. సంతసించితిని.

రుక్మిణి—(హర్షముతో) చెలీ! ఏమీ యవ్యక్తమధుర కంఠధ్వని ! (తొ (టుపాటుతో) భయపడకమనుచున్నాడే ? ఎవరై యుండునో—

సరో—త్వరపడకుము.

కృ—ప్రేయసీ - నే నెవడననియా నీ నాథుండను.

రుక్మిణి—(కనులార్పకచూచి) (తనలో) ఆహా యీ మహామహుని దర్శనమిప్పటికిగదా - బడయగల్గితిని. నా నోములు—వ్రతములు సిద్ధించెను. ఈ దివ్యపురుషునితో—నెంతభాషించెద. (సిగ్గుతో నావలకుజని) సరోజినీ- ఎందులకిటు వచ్చెనో యడుగుము.

సరో—చాలు, చాలు, ఎవరికి యక్కరో వారే యడిగెదరు. నాకేమంత నీవడిగిన నోటిముత్యములు రాలునా! (ఆలించి)అదుగో— అమ్మగారు నన్ను బిల్చుచున్నారు. (నిష్క్రి.)

రుక్మిణి—నాథా-యెన్నియోదినములనుండి కృశించి, నీనామోచ్చారణ జేసికొనుచు నున్నదానను, నన్నేకొని యెడిభారము నీయదియే సుమ్ము.

కృ—(తనలో) ఈకాంత నాయందత్యంత కామాన్వితయై యున్నది. కాన కొంచె ముత్సుకమ్ముచేసెద. (ప్రకాశముగా) మానినీ - నీతల్లిదండ్రులకు, నీ సోదరునకు. నిన్ను శిశుపాలునకే యివ్వవలయుననియే యుండెను. అందు నేడు—వివాహమని చైద్యుడు బంధుహిత సంఘములతో తర్లివచ్చెను. నేనెటుల చెట్టబట్టుదు. చేదిపాలుడు నాకంటె బలముగలవాడు, రాజ్యముగలవాడుకనుక వానినే గోరుము. అదిగాక—నీవు నన్ను వలచితివా ? ఏమీ వింత!

క॥ పులివిశ్వాసము పోల్కని
పొలతులు ప్రేమింతురొక్క పూరుషు మొదటా
వల మరియొకరిని గోరుదు
రిలలో వలపేడ కాంత లేడ తలంపఁ॥

రుక్మి—నాథా - అవి సతులపై దలపోయు దురూహ్యములుగాని, నిజ

ముగా నట్లుగాదు, కాంతలకున్న మనోనిశ్చయము మగవారికి
గలదా?

తే॥ ఎవని మోహించి మానంబు నీయమదిని
నెంచునో—కాంతవానికే యిచ్చుప్రాణ
ముల నతండొల్లడేని—హా పురుషులన్న
కఠినులౌట ద్యజింతురు గాదె సతుల! ॥

కృ—సుదతీ, అదియొక వింతగాదు.

క॥ కాంతలు మగవారల వే
వంతురు, కేకర విలాసభావంబులనా
డింతురు బొమ్మలగతి; హా
ఎంతైనను జేతురింతు లీశుల భువిలోన్॥

రుక్మిణి—కృష్ణా! పురుషులెంతవంచకులు.

తే॥ తనకుదానయివచ్చెడి తరుణినెటుల
నైన వంచించుటయె సాజమౌను పూరు
షులకు—నిన్నన నేల! కాంతలనుచౌక
గానెయింతకుగనుటమీ క్రౌర్యబుద్ధి! ॥

జీవితేశ్వరా!—ఈమన్మథుని బాధచే నన్నింకెంతని వేపెదవు. తమ దర్శనమునకై చంద్రునికై వేచు చకోరము రీతి, జలదాభిలాషియగు మయూరము భాతి కనులపండువుగా—నీసుందరాకారముగాంచి కర్ణపేయముగ మీమృదుమధుర భావలాలకించి హృదయసంతుష్టికై వాంఛించిన యీదీనురాలి మొరలాలించరాదా? నామనను నీకమ్మితివనిన విశ్వాసము లేదా?

కృ—మ॥ కలికీ చైద్యువరించి, సౌఖ్యముల వేగాంచంగదే—భూమిలో
పలరాజన్యాన్వితు వీడి పేదనువరింపన్ గోరువారుందురే.
తలపన్ లోకులు విన్నన వ్వెదరు చిత్తంబందు నన్ముందు నా
నకల యోజింపుము భీష్మకాత్మతనయా కాంతామణీ రుక్మిణీ॥

అదిగాక॥

తే॥ ఎవరుచెప్పిరో నాపైననింతమరులు
వట్టిగోలవు నీవు నాపల్కులవిను
మెందుకిటు చెడిపోయెదవింతి - వాని
గోరుమేగానిపోవుట కూడదబల. (అనిసడచును)

రుక్మిణి—(అడ్డముగాజని) నాథా - మీరేయిట్లనిన నేనేమనిచెప్పగలదా
నను బ్రాహ్మణుడు...మీరువచ్చితిరని చెప్పగనే-సంతోషవంతు
రాలనయి నావాంఛదీరునని గట్టినమ్మకముతో నుంటినిగాని -
యిత్తరి మీ రలక్ష్యముజేసినచో నికనేనుబ్రతుకగలనా! నాథా-
మీరు నామనస్సు పరీక్షింపనవసరము లేదు.

తే॥ జగతి సూర్యేందుతారలు సాక్షిగాగ
సకలదిక్కులు భూతముల్ సాక్షిగాగ
సదయ - యీతరుగుల్మముల్ సాక్షిగాగ
నిన్నె నానాథుగా నెంచుచున్నదాన॥

జీవితేశ్వరా - మనసార మొదటమిమ్ముగోరి మరల నింకొకరిని వరించుటకు నాహృదయము సమ్మతింపదు, నేను ధనమును జూచివరించుటకు వెలయాలిననుకొంటిరా? నాకొకటికావలసినది. అదియేసద్గుణము అట్టిది మీయందున్నదని గ్రహించి నేనుమిమ్ముగోరితిని. నాథా - నాప్రాణనాథా-నామతియంతయు జెడిపోయినది. శరీరముగృశించినది. కనులదుఃఖాశ్రువులుగారుచున్నవి. చూడుడు. నాస్థితిగాంచిన మీహృదయము గరుగలేదా - ఇంతకృపారహితాత్ముడవా —

కృ—(తనలో) ఆహా యీమెసాధ్వీతిలకమని చెప్పుటకెంతమాత్రము సందియము లేదు. ఇంకనుజెప్పిచూచెద. (ప్రకాశ) (చిరునగవుతో)

మ॥ కలికీ ! గుబ్బచనుద్వయంబుపయినీ కన్నీరుకూపారపా
ఘులవోలెప్రబవహించ, జిన్నినడుమోలోలాక్షికంపింపన
త్కులు వాయంపడిగద్గదస్వరముతో గుందంగనేలా, కటా,
తలమే యెవ్వరికైనదాట విధివ్రాతంజూడగాప్రేయసీ॥

కాంతా, నీవెంతదుఃఖించినను ప్రాప్తములేనిది నీమనోవాంఛయెట్లు దీరును? ప్రాప్తమేయుండిన నీ వెక్కువగా నాలోచింపకయే నెఱవేరును.

రుక్మిణి—ప్రాణేశ్వరా! నన్ను భరించుట నీకింతకష్టముగా నుండినదిగాబోలు? ముందుజన్మంబునందు నిన్నే పతిగాజేయుమనిగోరుచు దేవుని ప్రార్థింపుచు ప్రాణంబులవిడచెద (అని యురివేసికొనబోవును).

కృ—(ఆతురతతో) ప్రేయసీ! ఆగుమాగుము. ప్రాణహత్యజేసికొనిన మహాపాపముగదా, అట్లొనర్చుటనీకు మేరయే. భయపడకుము.

తే॥గీ॥ పడతినావయినీకున్న భక్తివలన
వెన్నవలె మృదువైన నీప్రేమవలన
మోదవారాశిలోపల మునిగిమునిగి
ప్రేయసీనీకు సాక్షాత్కరించినాడ॥

కాంతా నీదృఢభక్తి పరిశీలించుటకేవచ్చితిని. కాని యిచ్చటనిను గ్రహించుట ధీరులమగు మావంటిరాకుమారులకు ధర్మంబుగాదు. కావున నీవు గౌరీపూజార్థ మేగుదెంచినసమయమున॥

తే॥ పడమటిగిరీంద్రమున రవిపొడచుగాక
యేమువనధులు నొకసారియింకుగాక
పుడమితలక్రిందగునుగాక పోరునందు
చైద్యునదలించి నినుగొని చనెద నబల॥

రుక్మిణి—(సంతోషముతో) నాథా! అనుగ్రహముంచుము. అరుగో—మా తల్లిగారు నాకొరకెదురుచూచుచుందురు. పిల్చుచున్నారు. జనుచున్నాను. దయయుంచుడు (క్రేగంటజూచుచు నిష్క్రమించును).

కృ—ఆహా, ఏమాశీలము. ఆసుందరాకృతినిగాంచిన యేయతీశ్వరుని హృదయము చలింపకుండును?

చ॥ మగువలమీద భ్రాంతియనునూనమునించుక యేనిలేక రే
పగలనకుండగాను వనవాసముజేయుచు గొప్పనిష్ఠతో
జగతిదపస్సుజేయు మునిచందురులైనను కన్నులార నీ
మగువనుగాంచినంతనె భ్రమంబునజిక్కరె నిష్ఠలూడవే॥

ఇక్ అబ్బా, మీమన్మథబాధ, హా వైదర్భి, నామనంబెంత చీకాకుజేసిపోతివి, (ఆలోచించి) అవును దానితప్పేమియున్నది. నే నే మహానిర్భాగ్యుడను.

సీ॥ కాముబారినిబడి కష్టమందితి కౌగిలింపవేయన కౌగిలింపనైతి
తాపంబుగాంచితి దయతోడనన్ను లాలింపవేయనగ లాలింపనైతి
కాటుకకంట దుఃఖజలంబుగార్చి ముద్దియవేయనగ ముద్దీయనైతి
వంతమానాపైన ప్రాణకాంతా కటాక్షింపవేయన కటాక్షింపనైతి
నాధనానాథ నాప్రాణనాధనన్ను
ప్రేమపాలించవేయన వినగనైతి
పడతిపైకొనినప్పుడే పట్టిమదన
కదనమునదేలకయు పోతిగద కటకట॥

(ఒకదెసకు నిష్క్రమించును)

శ్రీ ర స్తు.

# రుక్మిణీ సందేశము.

## చతుర్థాంకము.

### మొదటిరంగము.

తెరయెత్తబడగా గౌరీదేవాలయము.

(పూలవల్లెముగొని రుక్మిణియు, ఆమెప్రక్కగా సరోజినియు, ఒకవైపు బలరామకృష్ణులును మరియొకచాయ రుక్మి శిశుపాల దంతవక్త్ర జరాసంధాదులుందురు.)

కృ—(తనలో) భళిరా, యీవనితా తారుణ్యవిలాసము!

ఉ॥ ఆనగుమోముఁగోము కనులా సరసీరుహ పత్రజైత్రముల్
ఆనళినారుసౌరు, హణాయలాబిగి చన్నులవ్రటువంబు నా
హా నును దళ్కుకాయము భళా! మృదువాక్య రసామృతంబు సొం
పా సనవిల్తు ముల్కియని యందురుగాంచిన నెట్టివారలున్!

శిశు—(తనలో) ఏమీ జగన్మోహనాకారము: (భయముతో) అక్కటా, వాసుదేవుడుకూడ వచ్చినట్లున్నదే. ఈమానిని నాచాయచూడక, యాతనివీక్షించునేమో, (అటునిటుజూచి) ఏమిది, శరీరము కంపమొందుచున్నది. పాదములు తడబడ, పెదవి యల్లలనాడుచున్నది. దీనివాల్చూపులు నాపైపేనా, (పరికించి) అమ్మయొయ్యో, కాదు. యింకేమియున్నది, వాసుదేవునిచాయ జూచుచున్నది. ఇంతవరకు కళ్యాణముఁగాలేదుగదా! కృష్ణునివరించునేమో, (గర్వముతో) పిచ్చియంతయు నావద్దనేయున్నది. వివాహంబాడ జనుదెంచియు భయపడనేల? పోనిమ్ము. అంత కెటులైన జంకు

లేదు. కృష్ణుడేగనుక రుక్మిణిని రాక్షసవివాహమున గొనిపోయి నచో, సమరక్షోణీతలమున వానిదాకి వానిసేనల బటాపంచల గావించి, రుక్మిణిని గ్రహింపక పోవుదునా!

సరో—అమ్మా, రుక్మిణీ, కళ్యాణసమయ మతిక్రమించునేమో; తొందరగా పూజగానిమ్ము.

రుక్మిణి—(నిమీలితలోచనయై) ఓభవానీ!

దండకము. శ్రీమన్మహాదేవి, దేవాళిస్తోత్రాంఘ్రీ, రాజీవనేత్రీ, జగన్నాయికా భర్గురాణీ, మదీయాత్మసంచారి నంజేరి నీవంటివారికి మనంగాచితీర్పన్ మదిన్గంక కంచున్ దయన్ ధైర్యముం జెప్పరాదా, హిమాగప్రదేశేనివాసీ, మనంబెల్ల సందేహసందోహముల్ నాట్యముంజేయదొడ్గెన్ శివాళంభురాజ్ఞీ జగన్మాత నంబ్రోవవే, వాంఛలందీర్చవే, కాళి, భద్రంబులంగూర్చవే, గౌరి, చండీశ్వరీ, మోహినీదేవి, యార్యా, నమస్తే నమస్తే నమః.

ఓపార్వతీ పరమేశ్వరులారా!

సీ॥ నల్లనితనుదాన, నల్లగళమువాడ, తెలిగట్టుపట్టి, యోతెల్లవాడ!
సారంగధరధరా, సారంగచికుర, సారంగవరనుత, సారంగనేత్ర!
గోపతివాహనా, గోద్వేషివాహనీ, గోజాస్త్రుభ్రాతృవ్య గోజనేత్ర,
గజముఖసంతాన గజచర్మపరిధాన గంగాసపత్నిస్వర్గాంగ జూట!
పదమునందెటులినిండి భావంబునుండు
నోయటుల వేరుగాకయె యుర్వియందు
నెసగుచుందురు శ్రీపార్వతీశులార
కరుణనేలుడు కొని నమస్కారములను॥

అమ్మా జగదీశ్వరీ,

శా॥ అమ్మా పార్వతి నీపదాంబుజయుగధ్యానామృతంబున్ సదా
నెమ్మిం గ్రాగుచునున్నదాన జననీ నీరేజపత్రేక్షణా!
ఎమ్మాడ్కిన్ మమ వాంఛదీర్చెదవొ దేవీ నీవె నాదిక్కనన్
రమ్మా! ధైర్యమొసంగుమా! నినుమదిన్ బ్రార్థింతు నేని త్తరిన్॥

సరో—అమ్మా త్వరపడుము.

రుక్మి—రుక్మిణీ! వేళ యతిక్రమించుచున్నది. జాగువలదు.

రుక్మిణి—(తనలో) ఆహా! యేమీ వాసుదేవుని దివ్యసౌందర్యవిలాసము ఇమ్మహాత్ముఁడు నాకువరుండైనచో—నమ్మాధవుని జీతబత్తెములు లేక యే—గొలువుసేయు సేవకునివలె చేసి కొనకయుందునా! తప్పక చేసికొందును. ఈ చతుర్భుజునికొరకు గోపికలు సమస్త బంధుమిత్రుల వదలి కామించినారనిన వృథా యేల—యగును. ఇంతకీ జగన్మోహనమే కారణము.

కృ—(తనలో) అదుగో—పాపము, రుక్మిణి నావైపు దీనదృష్టి నిగుడ్చుచున్నది. ఇట్టి ప్రేమాన్వితలగు స్త్రీల గౌగిట గదియించినగదా సంతోషము.

సరో—(తనలో) ఆహా!—సువర్ణంబునకు రత్నములదాపిన నేరీతిప్రకాశించునో! ఆలాగున నే!—సుకుమారియగు రుక్మిణికి యీసహజసౌందర్యవంతుడగు కృష్ణునిగూర్చిన నప్పుడుగదా బ్రహ్మసృష్టినై పుణ్యము గొనియాడదగును. లేనిచో—విప్రప్రయోజనము.

రుక్మిణి—(కేగంట జూచుచు, నడచును)

శిశు—అరరే! యేమిది! యేదియో మృష్టవాటిల్లునట్లున్నది. రుక్మిణీ వాసుదేవుల వాల్చూపులు చూచిన నాకు గుండె గుభేలు మనుచున్నది. పిలువని పేరంటమునకు పిలచినట్లుగా యీ యాదవుండేల రావలయును! వచ్చిననేల మర్యాదజేసి విడిదిల్లు జూపవలనయును! (దుఃఖముతో) కట్టా యేమిచేయుదును! (గర్వముతో) మనసా! అధైర్యమందకు. ఒకవేళ రుక్మిణి వలచినను, మేమిందరము రణశూరులము నిండియుండ దీసికొని పారిపోవుటకు, వానికి గుండేయుండునా! యుండదు.

కృ—(తనలో) అదుగో—వైదర్భి నాకు చాలా దగ్గరకువచ్చుచున్నది.

జరా—(తనలో) ఏలనో శిశుపాలుని మొగంబు, చిన్నవోయినది కనుకొలకుల నీరు గ్రమ్ముకొన్నది రుక్మిణిమీద నేమైన నిష్టము లేదేమో!—(ఆలోచించి) కాదు కాదు వాడే నాకిష్టమని నుడివెనుగదా!—

రుక్మిణి—(తనలో) కృష్ణా! నీవద్ద కేతెంచుచున్నాను, నన్ను రక్షించు భారము నీయదియే సుమ్మీ (అని చిరునగవు జూపును).

శిశు—జరాసంధా!—ఒక్కమాట, నీవిటురమ్మీ.

జరా—(నడచి) ఏమది!

శిశు—అటుచూడుము. రుక్మిణీకృష్ణుల హావభావవిలాసము లు, ఆ వాలూపులు, ఆ చిరునగవులు, అవిగాంచిన నాగుండెలవియుచున్నవి.

జరా—శిశుపాలా! యేలయీలీల నధైర్యమూనుట ఎంత వెఱ్ఱివాడవు రుక్మిణిని వివాహమాడుటకై చనుదెంచియు, వేరొకరు గ్రహింతు నేమోయని సందేహమేల! నిస్సంశయుడవు గమ్మీ.

కృ—ఇదుగో—నా ప్రాణము నా ప్రేయసినన్ను సమీపించినది. దాని నెత్తుకొని యరదంబున నిడికొని పోయెద యీ నరాధముల కపజయుంబుగల్గుగాక.

రుక్మిణి—ఇదుగో — మహానుభావుడు కూడ నా రాకకెదురుచూచుచున్నాడు. నాయందు పార్వతీ పరమేశ్వరుల కనుగ్రహము గల్గుగాక (నడచును)

కృ—(రుక్మిణిని యెత్తుకొని రథము నందుంచుకొనిపోవును)

(అందరు నిశ్చేష్టితులగుదురు.)

శిశు—(తొట్రుపాటుతో) అయ్యో—జరాసంధా — యిప్పుడు చేయవలసినదేమి? దుర్మార్గుడు కృష్ణుడు రుక్మిణిని దీసికొనిపోయెను.

(విచారించును)

జరా—సుత్రమా! చింతించుట నీవంటియుత్తమక్షత్రియునకు తగునా? అయినను వగచిన లాభమేమి? సమరరంగంబున వాని జయించి రుక్మిణిని నీకిప్పించెదలెమ్మీ.

దంత—అవును, మహాపరాక్రమవంతులమగు మువ్వురము మనముండగనే యీయాదవాధముడు క్షత్రియకన్యను, దీసికొని పోవుటయా? (బిగ్గరగా) ఓ క్షత్రియులారా మీ పరాక్రమౌదార్య నైపుణ్యము లేయేట గలసినవి. రాకుమారుండు వరించు పడంతినా? గొల్లవాడువరించుట? ఏమి విపరీతకాలము. రాజునకు రణమునందు

మరణించుటయే పరమధర్మము. ముసలితనమువచ్చి, యుద్ధము సమయపడనియెడల, —హాయిగా - తేరతిందులదిని - హంస తూలికాతల్పములందు బరుండక - మలమలమాడి, కృశించిచావ వలెను. అనిమనువు హిందూమాత సిద్ధాంతమున జెప్పియుండెను. కనుక మీరు దొంగకంతల నెందులకుదూరి పిరికివంద లనిపించు కొందురు. వీర పరాక్రమము బురికొల్పికొని - యాదవున కడ్డు పడుడు—క్షత్రియు డెప్పుడైనను యుద్ధమునందు మరణించవలసి నదే గదా? రండు. (అని నిష్క్రి.)

జరా—దంతవక్త్రా - నీ ప్రబోధముచే మనంతయు ధైర్యమూనినది. సేవకులందరు కవచధారులై ఖడ్గములబట్టి జయధ్వనులు జేయు చున్నారు, తక్కినరాజులు సహాయభూతులగు చున్నారు. చేది పాలా- సైనికులారా - రండు రండు.

(అందరు నిష్క్రిమణ.)

2 వ రంగము.

యు ద్ధ భూ మి .

(రుక్మిణి ప్రక్క కృష్ణుడు—బలరాముడు మరియొక వైపు శిశుపాల దంతవక్త్ర జరాసంధాదులు ప్రవేశము.)

రుక్మి—ఓరీ దుర్మదాంధా,

చ॥ నిలు నిలుమోరి క్రూర కడు నీచపుజాతి జనించితీవు స
త్కులమున బుట్టినట్టి నృపకోవిదు కీర్తిహీయించు కాంత ని
ట్టులగొనిపోదువే శరపటుత్వరుచింగొన నుంటివొక్కొ మా
కలికిని డించిపొమ్మికను కానిచో నుక్కడగింతు యాదవా ॥

దంత—ఓరీ నరాధమా! సమరక్షోణీతల పరిపంధిసందోహనగ సుత్రా ముడ దంతవక్త్రుడ. మదీయప్రతాపంబు వినినవాడవు కావు గా బోలు వినుము.

క॥ కరముల దోస్సద గగనము
శరధిని బుక్కిటను బడుదు జ్వాలనయినను నే

నురికెద వారిలో బోరెద
కరిఁగరికని కొట్టియడతు గద్వదమాళీ॥

బల—ఓరీ వాచాటా ! మొనమొన్న కనులుదెరచిన కూనవు, నీవెంత వాడవైతివి. యుద్ధములలో నారితేరినవానివలె ప్రగల్భములాడు చుంటివి. అమ్మపుట్టిల్లు మేనమామ యెరుగడా, యన్నట్లు, నీప్రతాపమెరుగకేము - అదిగాక మదీయసోదరుండు మహాను భావుండుచూడు.

చ॥ మడుగున నుండి కాపురము మానవపక్షి మృగాళికిన్ సతం
బిడుమల గూర్చుచుండిన యహింబడగూల్చె, మురాదిదైత్యుల
న్నడపెను, గోపబాలకుల గ్రేపులగాచియు, వజ్రిగర్వముం
గడపెను లోకరక్షకుడనన్ మిము జంపియు గాచుసాధులన్॥

శిశు—ఏమీ ! ప్రతిదినంబు కల్లుసారాలద్రాగి కండ క్రొవ్వుబట్టినా యేమి ? యీ తుచ్ఛుడా, మముంజంపి లోకములగాచువాడు, నోటికివచ్చినట్లు ప్రేలక నోరుమూయుము. (తమ్మునిజూచి) దంత వక్త్రా ! ఆతమ్మునికి దగినట్టులీయన్న చెప్పుటకు, బాగుగా కుది రినాడు. వాడుచేసిన పనులెవ్వరెరుగరనియో ? ఓరీకృష్ణా !

సీ॥ పాలీయవచ్చిన పడతిజంపుటగాదు ప్రవిమలురైన శాత్రవులుగాని
గొల్లభామలతోడగూడియాడుటగాదుకడుభయంబగుసంయుగంబుగాని
లలివిన వంశనాళనినాదమునుగాదు వారణతురగాళి ధ్వనులుగాని
కూరిమి నదలింపగోబృందములుగావుపటుబలాన్వితులరాభటులుఁగాని
తేఁ॥ సిరియో తెలియకరయెు యిట్టులను కలహ
భూమిజొచ్చినవాడవు పొమ్ముపడతి
నిచటడించియు నోరోరిహీన నన్ను
శరణుజొచ్చిన రక్షింతునైచితప్పు॥

కృష్ణు—ఓరీస్వభూషణ పరదూషణ పరాయణా!

ఉ॥ ఎందరో నిన్నుబోలెడినరేశులు నావలనంగతించినా
రందరికన్ననీ వతిబలాఢ్యుడవా జనులెన్నసద్యశం

బందితివా? సురాదులకునైన నసాధ్యపుకార్యముల్ ముదం
బందుచునే మొనర్చితివి యారయనైతివి ముందునీగతిన్॥

జరా—ఓహో! అసంబద్ధప్రలాపీ! ఏమీనీప్రాగల్భ్యములు:

ఉ॥ కొంగవధంచుటో వడిగఁగోడెను జంపుటొ మద్దిచెట్లనుం
భంగముజేయుటో ఘనజవంబున బండినికాలదన్నుటో
అంగనగూల్చుటో విలువనంతము జేయుటొ రోలులాగుటో
వెంగలియంచునెంచితివె వీరులగెల్చుట యుద్ధభూమినిన్॥

కృష్ణ—ఓరీవరివంధీ! జరాసంధా! అప్పుడు, నీవనినట్లు- యుగంబులుతల క్రిందుగా పరిశీలించినను, మేము మీకు సాటిరాజాలము.

జరా—నిజము. రాజాలరు. మునుమ్మాటికి రాజాలరు.

కృష్ణ—ఎందులో- నంటివేని, వినుము.

సీ॥ ఇతరులవల్లెత్తియేమేనియనకయె మనెకి సాధువులపీడన మొనర్ప
సమరరంగంబుల శాత్రవావళిజూచి పిరికిమనంబునవరుగులెత్త
మునులు యజ్ఞంబులనొనరుపయజ్ఞవాటికల ప్రక్కలగనాచకయజేయ
తనమనంబుననుగోరని కాంత కేలుచేపట్టనెంచుటయందు బంధుజనుల
నాడిపోయుటయందు మీరగ్రగణ్యు
లైతిరారార మీపనులద్భుతములు
మాటుబెట్టినశిలలు మీమానసములు
పరులజెడగొట్టుటయె మీస్వాభావికములు॥

దంత—ఓయాదవకులాధమా! నీకు మమ్ములనిందించునంత యధికారము లేదేచూడుము.

సీ॥ నీమొద్దుదేహంబు నీరదచ్ఛాయను పోలునటంచుముముక్షులనిరి
వల్లవులిండ్లలోబడి వెన్నముద్దలనపహరించిన నిన్నుహరివియనిరి
బలిమినిగోపికా వనితలరతులదేలించిన శ్రీవిష్ణులీలలనిరి
నీగారడితనంబు నీముచ్చుతనము నీమాయపనులు విష్ణుమాయలనిరి
పిరికిపందలుకొందరు భీతిజెంది
నీకుబిరుదంబులిచ్చిరి గాకయున్న

నీ బ్రతుకు నీదుకులము మనీషులెవరె
రుంగుదురు యాదవాధమా పొంగబోకుమ॥

బల—ఓరీ నీమాటలకిక సహింపను. మదీయముసలంబున కాహారంబు గానోపర్రు.

జరా—బలరామా! బాలురపై కి యేమికుప్పిగంతులు వైచెదవు. కాని నీ బలంబేమో నాకడగొంచెముఃజూపుము.

కృష్ణ—ఓరీజరాసంధా:—మున్నుమానగరంబు, నీవుచతురంగ బలంబులతోజనుదెంచి ముట్టడించ, పదియారుసారులు, నిన్నుదృణప్రాయునిగా జూచి పారదోలుటయు, పదియేడవసారి మాయన్ననిన్ను పాశంబులచేబంధించి, చంపబోవునంతనేను వారించి దాసుండని చెప్పి, వదలిపెట్టిన నిప్పటికి నాకేయడ్డుతగిలితివా! ఓరీకృతఘ్నా!

జరా—ఏమీ! యాదవా! మదీయప్రతాప కలాపంబునకాగజాలక మీయన్నతోగూడ, యిరువదియొక్కమారు కొండపై నెక్కి ప్రాణంబుల రక్షించుకొనిన పందవు. నన్ను గేలిసేయుచుంటివా! అప్పుడెట్లనో బాలుడవనివదలితిని. కాని యిత్తరివదల దలచుకొన లేదు. జీవంబుల జాగ్రతగాగాచుకొనుము.

దంత—(చూచి) ఓహోరుక్మీ! యేమిది, యాదవసైన్యంబులు మనసైన్యంబుల బటాపంచలు కావించుచున్నవి. (బిగ్గరగా) ఓభటులారా!

ఉ॥ ఆగుడు పోకుపోకుడు రణావని నే నిలువంగ భీతియే
లా గజవాజి పూగము పలాయనమాయెను మిమ్ము జూచి మీ
త్యాగముజూపి యాదవ పదాతుల నుక్కడగించ రండు మీ
దేగురురాజుకీర్తిని మహిన్నిలబెట్టెడి భారమంతయుః॥

(పరికించి హర్షముతో) ఓసైనికులారా! నావంటి వీరక్షత్రియుని వద్దనుండు భృత్యులగు మీకు రణచతురత నేరుపవలయునా? అక్కరయే లేదు. మీపరాక్రమింకను జూపుడు.

రుక్మి—(నడచి) ఓవీరపదాతులారా, ఇదుగోవినుడు.

ఉ॥ కొట్టుడు యాదవాధముల కొంకిసుమంతయు లేక కట్టలం
దట్టుచు నేన్గులన్ మలిపిదాకగ, దేరుల బిండిపిండిగా
గొట్టుడు శత్రురాజులను గోసియు కండల గ్రద్దజాతికిన్
బెట్టుడు పాపమంచనక వేయుడి మంటలకొట్లనుంచుడీ.

బలేసైనికులారా, వెనుదీయక విజయంబునుగాంచుడు మీవంటి పరాక్రమవంతులతో హీనులగు గొల్లలు పోరలేరులెండు. జాగ్రతగా పనిచేయుడు.

దంత—(ఆతురతతో ఒకచాయచూచి) అకటకటా- యిదేమీ దేస సైన్యమంతయు చికాకుపడినది. అయ్యో,

ఉ॥ నెత్తుటదోగువారు కడు నీరసమ్ముం వెళ్ళబుచ్చువారు చే
యెత్తిమొగంబునందిడియు నేడ్చెడి వార లొహహోయటంచు నో
రెత్తియు బిల్చువారు బలహీనులునై మొరలెట్టువారు జా
గ్రత్తగనుండువారలు బిరాన పారెడివార లక్కటా.

కృ—(పరికించి హర్షముతో) ఆహా, సైనికులెంత బాగుగాయుద్ధము చేయుచున్నారు. భళిరా యాదవభటులారా,

చ॥ మనసున ధైర్యమున్విడక మాంద్యము లేకయ శాత్రవాళిమీ
రనిదునుమాడుచుంటిరి భళావిజయంబు ఘటించుమీరికన్
వెనుక మొగంబు బెట్టకుడి వీరులటంచును పేరులెండి యో
ఘనమతులార - చైద్యబలగం బొకలెక్క-యె మీకుజూడగన్॥

అన్నా బలరామా, అదిగో- ఆవైపు యాదవసేనను సాళ్వుడు తాకుచున్నాడు. గాన నీవు జాగుసేయక వెళ్లిరమ్ము.

బల—(నడచి) సోదరా, నేనుజనకుండనే, సాళ్వునకు నుద్ధవుండు పదతాడిత కృష్ణభుజంగమువలె మండిపడి యోరీ నిలునిలుమని రెండుబాణంబులచే నిలువంబెట్టి పదిబాణంబుల నొప్పించినాడు. చూడుము.

కృ—అవునుగాని అదుగో శిశుపాలుడు దండధరునివలె భయంకరరూపముతో వచ్చుచున్నాడు.

శిశు—ఓరీ దేవకీతనయా,

సీ॥ పోరాడనాతోడ భుజవిక్రమము లేమి నిధియందునీవు మున్గెదవుగాక

సమరంబునల్పక సౌఖ్యంబుఞ - ఛించి యిలక్రిందనుండబో యెదవుగాక
ప్రాణంబునిచ్చిన బలుసాకు మనియెదవని వనులకేగెదవుగాక
స్వర్లోకమునకేగి శరణంచ వేంద్రు పదములబడినపడెదవుగాక
కఱకుకత్తిచేత-కంఠం.. విదలించి
రక్తమాంసములను గ్రద్దలాది
గలుగుపక్షి నికరములకు నాహారంబు
గానొనర్తు జూడు మేనునీచ॥

కృ—ఓరీ- శౌండీరాగ్రేసగా,

సీ॥ దరులపై కెగబారి వరగడి నదిపెంపు స్వల్పకాలంబులో సమసిపోవు
తరుగుల్మలతలచే వరలుచున్నవనంబు కార్చిచ్చు జనియించ గాలిపోవు
కట్టపై పొర్లుచున్నట్టి తటాకంబు కనురెప్పపాటైన మనగలేదు
అలవర్షఋతువులోపల పూర్తినిండిన సరసులు వేసవిఁ సమయుగనుక
ఎంతయడకువ గల్గిన నంతసుఖము
యెంత దుర్మదముండిన యంతదుఃఖ
మమరుగావున నోర్మ్యాయు మాయువువయి
బ్రీతియుండిన లేదేని బింకమడతు॥

శిశు—ఓరీ పరిపంథీ! యాదవా! దుర్గుణాన్వితుడవగు నీవా - నాకు నీతులుపదేశించెడివాడవు. వల్లకీగృహంబుల జారచోరత్వములు జేసి జేసి మదించితివి.

సీ॥ జలరుహాక్షులుగూడి జలకంబులాడంగ మించికోకల దొంగిలించితీవు
మేనత్తయగు రాధతో ననుమానంబు డించి ప్రేముడిని గ్రీడించితీవు
మధురాపురంబులో మాకంసుదాసియై కుంటియాకుబ్జనుగూడితీవు
కడుపారగా పాలనిడజనుదెంచిన సాధ్వియా పూతనం జంపితీవు
దుండగములన్ని నీయందె దోచుచుండె
ధర్మకార్యములందు తత్పరులమైన
మాకుబోలవు నీవు ముమ్మాటికి మహీ
బల మహోన్నత గౌరవ పదములంద॥

దిగాక—

క॥ నా కీవు బావవుగదా !
నా కీయగ నెంచినట్టి నాతిని నకటా
నీకుఁ జెల్లెలెకద నీ
వీకాంతను బట్ట నెట్టు లెంచితివోరీ! ॥

కృ—ఏరా నీవాగుడున కడ్డులేక యున్నయది. ఓరీ వాచాటా

తే॥ ఆకులలములదించు వనాళియందు
తపముసల్పెడి మునుల స్వాంతంబులకు న
గోచరంబగు నామాయ క్రూరబుద్ధి
వైన నీకెరుగంగ సాధ్యంబె చూడ॥

శిశు—ఓరీ తస్కరా! దుర్గుణప్రకర! యేమీ! నీవు భగవంతుడవా ! ఆ భగవంతుని కాలియందు గలరేఖ నీ మొగముననగూడ లేదు గదరా! వెండియు,

ఆ॥ వె॥ బల్లిసర్పమౌనె యిల్లోనె పందిరి
ఖురముతురగమౌనె కలయుదార్ధ
మౌనె కాకి కోకిలౌనె యుల్లైయైన
విష్ణువగుదు వీవు వెఱ్ఱిగొల్ల॥

అదిగాక—

క॥ జారుండవు జన్మముననె
చోరుండవు సంతతంబు శఠక్రియలఁ
పారీణుడ వీక్షింపగ
నోరీ! నీకంటె దుష్టుడుండడు భువిలో॥

ఓరీ వెన్నదొంగ !

సీ॥ నీవల్ల నేగదా ! నీతల్లిదండ్రులు పడరాని కష్టాలు పడిరి నాడు
నీవల్లనేగదా ! నేలబాసియు, ఘోషజనులు బృందావని జనిరి నాడు
నీవల్లనేగదా ! నీరాడురేవులో పడతులు లజ్జ గోల్పడిరి నాడు
నీవల్లనేగదా ! దేవతాధిపునకు జన్నంబుగొల్లలు సల్పకుండ్రి
గోపకాంతలు మగలతో గాపురంబు
బాగుగాసల్పకుంట నీవల్లనెగద

తరచిచూడంగ నీవెగా పరమఖలుఁడ
వధమజాతివి హీనతస్కరుడ వవని॥

దంత—అన్నా! నీ దెవ్వుమాటలకైనా కోపతాపములు లేక కట్టిబొద్దు వోలె నట్లనె నిలువంబడి యున్నాడేమి!

శిశు—లేనిమాటలన్నగదా రోషము. (రోషముతో) యాదవా! ఇవిగో నావాడిశరంబులు వచ్చుచున్నవి. ఇక శరీరము గాచికొనుము. ప్రాణముపై తీపిగలదేని వడలిని డించిపొమ్ము.

బల—ఏమినీవాగుడు. నీకంతెవంద యిచ్చెవ్వడును లేడు. ఎక్కువగా మాటలాడి ప్రాణముల గోల్పోకుము. (తిరస్కారముగా) పాపము! పెండ్లి గావలసినవాడవు!!

దంత—ఓరీ ముష్కరా! నిరంతర కాంతాజన సంగమోత్సాహ. హృదయూ!

తే॥గీ॥ కోడికూత్రల నెన్నియో గూసి నిశల
గోపకులనెల్ల మేల్కొల్పి గోగణంబు
దోలుకొని వారుజన వారి తోయజాక్షు
లను బలిమిబట్టి రతులదేలవె కుబుద్ధి॥
అదిగాక!

సీ॥ దాసీకులంబని తలఁపక కుబ్జతో గలసి యుండిన నీకు గలదెలజ్జ
విదురునిగృహములో వేడ్కమీరగ విందుసల్పియుండిననీకుగలదెకులము
లలిజారచోరత్వములనెల్ల గడిదేరి సలిపెడినీకును గలదెభయము
అలయశోదాదేవివలన రోలను త్రాట గట్టబడిన నీకు గలదెగుణము
తల్లిదండ్రులు పరుని కీడలచినట్టి
కక్కబల్మినిగొని చనగనుజగంబు
దూరుననియెంచవైతి వోరోరియదుకు
లాబ్ధి బడబానలా! దురాత్మా! నికృష్ట॥

కృ—ఓరీ! రాజకులపాంసనా! యిట్టిపలుకులతో ప్రయోజనమేమి! బలముగలాడవేని రణంబున కుపక్రమింపుము.

దంత—(కోపముతో)

ఉ॥ చచ్చెదుచచ్చెదిప్పుడె నిశాతశరంబిదెవచ్చె జీవమం
దిచ్ఛజనించెనేని పతినిచ్చిపదంబుల వ్రాలు కానిచో
ముచ్చ! దురంబునందున త్రిమూర్తులుసాయముగాను నీకు వే
వచ్చిననైన నాయముని పట్నముజూపకమాన దుర్మతీ॥

(ఆతురతతో నొకవైపుచూచి) అకటా! సాత్యకిదాడికినిల్వలేక నా సేనాధిపతులందరు వెనుకకు బారిపోవుచున్నారు. (బిగ్గరగా) ఓదండనాథులారా! యేలమీరిట్లు వెనుదీసెదరు.

క॥ భండనమున హరిగెలువగ
రండు చమూనాథులార! రణమున విగతా
సుండయిన వానికరచెయి
నుండునుగద స్వఃపురంబు యోచనజేయరా॥

బల—సోదరా, ఎంతకాలం బీనీచులపలుకులకు శాంతింతుము.

జరా—శాంతించక యేమిచేయుదురు. అధికునిజూచినప్పుడల్పునకు శాంతమబ్బుట లోకసామాన్యమేగదా! అదిగాక ఇక్కడ మీకంటె పంద యెవ్వడును లేడు.

తే॥గీ॥ స్థాణువాహరి యాజగత్ప్రాణుడైన
భుజబలక్రమమున నాకుబోలలేరు
కానినీవేడ నాతోడ గదనమేడ
ఉడుతయూపులకే చెట్టుపుడమిబడునె॥

కృ—ఓరీ జరాసంధా! "అశక్తున కర్భుదముల్ ప్రగల్భముల్" అనినట్లు- ఏమినీప్రగల్భములు. నీపౌరుషం బెవ్వరెరుగనిది.

జరా—ఓరీ ఆత్మశ్లాఘీ, అధర్మసంగరక్రియాచాతుర్యధౌరేయ, ఏమినావి ప్రాగల్భ్యములా! (కోపముతో)

ఉ॥ కారులుగట్టిపెట్టుమిక గర్వమడంచెద నాల్కచీల్చెదన్
క్రూరనిశాతఖడ్గమున క్షోణిపతుల్భళి బాపురేయనన్
సారభుజాబలక్రమ నిశాంతుడ దాంతుడ వీరశౌర్య గం
భీరుడ శాత్రవప్రకర భీముడ నేనదురాత్మయాదవా॥

తే॥గీ॥ గొల్లవారలుమెచ్చగా గూర్మిబృంద
యందు గంతులువేయుటయంచు దలచి
నావె? మాతోడ ఘోరరణంబునిచట
సల్పుట! నికృష్టధూర్త! వంచక! కుబుద్ధి॥

కృ—ఓరోరీ శత్రురాజులారా! మీరనగా నాకొకలెక్కయా! యిదుగో కాచుకొనుడు. (అని మోహనాస్త్రము ప్రయోగించును.)

(అందరు పడిపోదురు. బలరామ కృష్ణ రుక్మిణులు నిష్క్రమింతురు)

శిశు—(లేచి) హా దైవమా! యెంతపని చేసితివిరా. (కోపముతో) ఓరీ యాదవా! నాకు నీవు బావవుగదా. నాకీయజొచ్చిన రుక్మిణీ కాంత నీకు చెల్లెలుగదా! చెల్లెలని యెంచక యిట్లు తీసికొని పోవుట న్యాయమా. (తలనూచుచు) ఓరీ దుష్టా! నీవిట్టి పాపపు పనులకు వచ్చెదవని కలనైన దలంచనైతిని. (నిదానించి) అవును మేనత్తయగు రాధతో గలసిన నీకు చెల్లెలను సంశయము మాత్రముదోచునా! దోచదు. (పండ్లుగొరుకుచు తొట్రుపాటుతో) దురాత్మా! దురాత్మా! యెచ్చటికి బోయెదవు. ఇదిగో—యిప్పుడే నీరథంబు నుగ్గునూచంజేసి నీ కాల్బలంబుల బటాపంచలు గావించి నీరథాంగముల పిండిపిండిగా నొనర్చి నిన్ను నీసోదరుని యడంచి రుక్మిణినిదెచ్చెదను జూడుము. (హాహాయని పడును.)

జరా—ఏమిది! వింతగానున్నది. యాదవుడేడీ!

శిశు—ఇంకెక్కడి యాదవుడు! అప్పుడే పోయినాడు. రండు రండు పోదము. (నిష్క్రమణ.)

రుక్మి—(కోపముతో) ఓరీ మానవాధమా, నిన్నా దేవకి యెట్లు గన్నదిరా! ఇంత దుర్బుద్ధివనియే మాకంసుడు నిన్నుజంపదలంచినది (దిగులుతో) అయ్యో రుక్మిణీ! యెంత చెప్పినను వినక తుదకా యాదవునకే దక్కితివా! ఎంత నీచకాలమందుద్భవించితివే! అకళంకంబైన మన వంశంబందు నీవలన నేటికి మహాకళంకము గలిగినది. ఇంతపాపాత్మురాలవని నాకిదివరకే తెలిసియుండిన తల్లి

దండ్రులు దిగులుచేత గృశించినను, తిట్టినను నిన్ను దప్పక చంపియే యుందును! (నిదానించి.) ఆ! యేమిది. చెల్లని జంపుట యా! ఎట్లు? కోరినవానికిచ్చి చేయుట రాచధర్మమేగదా !అట్లుల రామునర్పకపోతిని. (క్రోధముతో) ఓద్విపాదపశువా! యాదవా! ఒకరికీయనెంచిన మాపిల్లను నీవు బలాత్కారముగాగొని పోవుట తగదు. నీవు నాయవక్రపరాక్రమ విక్రమము వినలేదు గాబోలు! చూపెదనుండుము. ఓ జరాసంధాదిమిత్రులారా ! రండురండు· తుచ్ఛుని మచ్చమాపుదము. (అందరు హడావుడిగా నిష్క్రమింతురు.)

(అందరు మరల ప్రవేశింతురు)

శిశు—మాగధా! యేమిది, కృష్ణుడప్పుడే యెంతదూరమరిగెను. ఎక్కడ జూచినను గన్పడడు. చనుదము రండు. ఎట్టులైన వాని జయించి పడంతిని గొనవలె. లేనిచో ప్రాణములేల !... చచ్చెద !

జరా—(తనలో) ఆహా, జగజెట్టి యనిన నీవాసుదేవునకే చెల్లును గాని యింకెరికిని చెల్లదు. మోహనాస్త్రము బ్రయోగించి మమ్ముల నందరి నరనిముసంబులో పడిపోవునట్లుచేసి యేగినాడు. (ప్రకాశముగా) శిశుపాలా ! విచారింపకుము. ధైర్యమూనుము.

శిశు—కట్టా ! యింకెక్కడి ధైర్యము.

చ॥ సిరిగల తావటంచు ఘనశేముషిగల్గిన వారి యంచు నీ
తరుణిని భార్యగాగొనిన తప్పక రాజ్యము కొంతయైన ని
త్తురనియు నత్తవారు మరదుల్ కడు ప్రేముడి జూతురంచు సుం
దరముగనుందు మంచును మనంబున నెంచితి నింతేము వ్కకా! ॥

అయ్యయ్యో ! తలచుకొనిన గుండె నీరగుచున్నది.

తే॥ చుట్టపక్కంబులను బిల్చి పట్టణంబు
నంతగై సేయగాను నేనెంతొ ధనము
వ్యయము జేసితి నావివాహంబటంచు
నా కమలనేత్రి తుదకెగనూకి పోయె ॥

రుక్మి! నన్నిట్లవమానము జేయుటకేనా పెండ్లి పెండ్లియని రప్పించినది. !

రుక్మి—బావా! నామనంబు నీవెరుంగవా! నిన్నవమానము జేయుసంగతి ప్రమాదవశంబునన్నైన దలంచనైతిని.

శిశు—బావా! నాగతి నేటి కతిహీనమైపోయినది.

తే. బంధుజనములలో తలవంపులాయె
హితులలో వలనాకు చిన్నతనమాయె
ధనము వ్యయమయిపోయె, పొందగనువలసె
నక్కటా! దుర్యశంబు నీయవనియందు॥

జరా—ఓశిశుపాలా! దుఃఖించక యోర్చుకొనుము.

ఆ॥వె॥ బ్రతుకవచ్చునోడల బ్రాణంబులుంచిన
బ్రతుకుగల్గెనేని భార్యగలదు
బ్రతికితీవు భార్యపట్టుదైవమెరుంగు
వగవనలదుచైద్య! వలదువలదు॥ (భాగ)

వినుము మనుష్యుం డెవ్వండు స్వతంత్రుడుగాక ఈశ్వరుని మాయలోబడి సుఖదుఃఖము లనుభవించుచుండును. తొల్లి మధురాపురంబుపై పదియేడుమారులు విక్రమంబునవిడిసి సప్తదశవారంబులు కృష్ణునిచేత హతసైన్యుండనై బలరామునిచే పట్టువడ నాయందు దయారసంబున వాసుదేవుండు విడిపింప జైలువెడలి యిలుజొచ్చుదొంగవలె పురంబుజేరి క్రమ్మర యిరువది మూడక్షోహిణులుగూర్చికొని పదినెనిమిదవసారి ముట్టడించిన నంతమహావిజయంబు చేకూరినది. కనుక జయాపజయంబులు దైవాధీనంబులుగదా, అంతటనుండి నేను గెలుపోదులకు హర్షశోకంబు లందక చరించుచుంటిని.

శిశు—నీవెన్ని చెప్పినను యుద్ధమునకుపక్రమింపవలసిన దే.

జరా—ఇంకా ఎందులకాపిచ్చమాట. నేటిదినంబు వాసుదేవునికి విజయమేకాని యపజయంబులేదు. మనము కష్టముచే కలహించినను ప్రాణములబాయుటేకాని మరొండేమియులేదు.

రుక్మి—ఓమిత్రులారా, (కోపముతో)

ఉ॥ కల్లరినాలిముచ్చుకడుగారడివాడు జనుండు హీను డా
గొల్లడు, చైద్యుడాది నృపకోటిశిరంబులు వంపుగాగ, నా

చెల్లినివేగదీసికొని చేరుచునుండెను వానివల్లె మా
పిల్లనుదెత్తు యాదవుని పీచమడంచియు చూడుడి త్తరి॥
(ఆతురతతో నిష్క్రమించును)

దంత—అన్నా! మదియందుంచు కేనియు దిగులుకలిగించుకొనకు. మహా
రాజువగు నీకు భార్యలకేమి! రేపిదివరకు పెండ్లికమ్మన్న కాదా!

శిశు—అవును - లెక్క లేకయవుతుంది. రుక్మి రుక్మిణిని దీసికొనివచ్చినను
మనము యుద్ధములో వానినోడించి రుక్మిణినిదెచ్చికొనినను గౌరవ
హీనమేగాని గౌరవము గాదు.

దంత—ఆమాటనిజము. ఒకడు తీసికొనిపోయినదానిని మరలనీవుగ్రహిం
చుట తప్పుగాదామరి.

జరా—మనము విశిదింట్లకేగి ప్రయాణముగుదమురండు. వచ్చినందులకు—
పరాభవమాయెనుగదా -
(అందరు నిష్క్రమింతురు.)



శ్రీరస్తు.

# రుక్మిణీసందేశము.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

ద్వారకాపురి మార్గము.

(బలరాముడు, కృష్ణుడు, రుక్మిణి ప్రవేశము.)

(తెరలో—నిలు నిలుమోరి క్రూర !)

బల—సోదరా ! ఏమాధ్వని !

కృ—(ఆలించి) అగ్రజా ! అది రుక్మిణి కంఠస్వరమువలె నున్నది. (పరికించి) అదుగో—వీరభటానీకముతో రుక్మి చనుదెంచుచున్నాడు.

రుక్మి—(ప్రవేశించి)

స్రగ్ధర॥ ఓరోరీ క్రూర నీయాయువును ముగిసె నీయుద్ధభూమిం దురాత్మా
ఆరాజీవాక్షుఁడైనం హరుఁడయినను సాహాయ్యమై వచ్చినం గా
నీ రాజుల్ మెచ్చఁగం బోనివక యుఁడచెదం నిన్ను నీసైన్యరాజిం
గారాబంబూను చెల్లెం గయికొని జనఁగం న్యాయమే హీనజన్మా!

కృ—(ఎగతాళిగ) ఓహో బావగారుగానున్నారే ! ఒకసారి మదీయ నిశితాశుగంబులకు నొచ్చియు, మరల జనుదెంచుచుంటివా! నీతో జరించుచున్న యా ముచ్చుర నరాధముల నేయేటఁ గలిపివచ్చితివి?

బల—సోదరా ! వేరేయడుగనేల ! వారలు బ్రతికిన బలుసాకైనదిని బ్రతుకవచ్చునని, యెంచి వెనుకకు బారిపోయిరి. పాపము !—రుక్మిమాత్రము జీవింపదలచుకొనక చెల్లెలిమీఁద ప్రేమచేతవచ్చుచున్నాడు.

రుక్మిణి—ఓరీనికృష్టులారా ! మీకుజంకె యుద్ధముచేయక పోవుటగాదు

రాజ్యవిహీనులతో మనవంటి యుత్తమ క్షత్రియులు సమరమొన
ర్చుట పాడిగాదని జరాసంధ శిశుపాలాదులు తలంచిచనిరి. నేను
మాత్రము రుక్మిణికై వచ్చితిని.

రుక్మిణి—(తనలో) ఆహా! జగదేకవీరుడగు నావల్లభునిగెల్చి నన్ను తీసి
కొనిపోవలెనని వచ్చినాడట! యేమీదుర్మోహము.

రుక్మి—

సీ॥ అతిబలాఢ్యుడవంచు నాదరించెదమన్న పారుబోతులలోన ప్రథమవీవు
మాననీయుడవంచు మన్నించెదమటన్నతులువలందున మేటితులువవీవు
బంధుపాత్రుడవంచు పరికించెదమటన్న మేనమామనుజంపి మెలగితీవు
రాజరాజవటంచు పూజింతమాయన్న నర్హాచారము లేక యుంటివీవు
గొల్లభామలతోగూడి గోగణంబు
బృందలో గాచుచుండిన పందవీవు
మాకు సరిరానివాడవు మాదుపిల్ల
నిటుల గొంపోవుటయు నీకు హితముగాదు॥

కృ—ఓరీ రాజకులపాంసనా!
తే॥ చెల్మినాతోడ జేయనెంచిన త్వదీయ
సోదరీమణి మొరల ననాదరించి
చైద్యునకు నీయనెంచిన జాడదెలసి
బల్మిగైకొని చనుచుంటి పట్టణమునకు

ఇందు నాతప్పేమియున్నది. భూతములందు దయయుంచుటపరమ
ధర్మము గదా! కనుక పంచప్రాణములు నాపైనిడికొని నిద్రాహారముల
వదలి, మనసారవరించి, నేనే పరమగతినని తలంచుచున్న నీసోదరినెట్లు
గ్రహింపకుందును! ఇంతమాత్రపు ధర్మసూక్ష్మమెరుంగలేక పోతివి!
(తలనూపి) అవును వంశమున కొకడుండును......

రుక్మి—అవును నావలన నేటికి పవిత్రమైన మావంశము కళంకమైనదను
కొనుము. మీవంశమాదినుండి యిట్లుమలినమైనదిగదా...చూడుము.

సీ॥ ప్రాణనాధుండుండ పరపురుషులగూడి కొడుకులనీయత్త కుంతిగనియె
మునునీవు పుట్టినప్పుడు జైలులో గాడిద పదద్వయంబు నీతండ్రిపట్టె

సరివారుచూచిన పరిహాసింతురటంచు నీయన్న కల్యాణమందరోయడయ్యె
వల్లవాంగనల కవ్వాలదెబ్బలుదించు నిల్లిల్లుదిరుగ నీకిష్టమాయె
వేలమాటలికేల గోపాలమీదు
యాదవాన్వయ గౌరవం బంతతెలిసె
పరుల జెడగొట్టుటయెమీకు పరమవ్రతము
బొల్లిగ్రద్దనునెక్కిన నల్లవాడ॥

కృ—మేమాపన్నులైన వారిని రక్షించితిమిగాని మీవలె చెడగొట్టు
టెరుంగము.

రుక్మి—తొందరపడకు, ఆలోచించుకొనుము. ఒకవేళ నారాయణుండ
వని నీవనుకొనినను,

తే॥ సర్వభూతంబులందున సముడుదాన
శాలి పుణ్యుండునగు బలిచక్రవర్తి
యరయనే మపకృతి సల్పెనంచునీకు
యుర్విలోపలికిని ద్రొక్కియుంటివీవు॥

బల—ఏమిరా! ద్రోహీ సహించి యూరకున్నకొలది నెత్తికెక్కుచుం
టివా!

రుక్మి—ఏమీ నీవునన్ను సహించితివా - (తలనూచి) అవును.

క॥ తనకంటె గొప్పవానిని
గనినప్పుడు శాంతమబ్బగనుకను ననుజూ
చిన మీకు సహనమేర్పడె
ననిలోపల జావు నిశ్చయంబనిభీతిన్॥

కృ—ఓరీవైరీ!

సీ॥ తగరుదాకినయంత నగముచలించునే కాలిడ్డనాగునే గాంగతటిని
పిల్లగాడ్పులకు గంపించునే మేరువు చల్లారునే యగ్గి చొల్లుచేత
ఖద్యోతమున నంధకారంబడంగునే కుక్కకుజంకునే కుంజరంబు
గోవున కలకునే క్రూరశార్దూలంబు, చటకాళి కలకునే సాళువంబు
ఎదుటిబలమును నీబలమెరుగలేక
పెట్టుకొంటివి నాతోడ భీకరాజి

దురమునందున ననుగెల్వ తరముగాదు
చావుమీదాశయుండిన సల్పురణము॥

రుక్మి—ఏమీ నీధైర్యము. నీస్వభూషణ పరదూషణ పరాయణత. నీవాచానైపుణ్యము. నీకుమాటలలోనున్న తెలివి యుద్ధములోనున్న యెడల నీవు చెప్పినట్లేయగును. గాని ప్రస్తుతముగాదు. ఎంకటి పిరికిపందవు.

చ॥ తరుణిని నాదుచెల్లిని ముదంబునగైకొని చైద్యుడాది భూ
వరులను గెల్వజాలక జవంబున బారుచునుంటివేల! ముర్
గరి నలమల్లురం బకుని గంసుని గేశిని యోధు వత్సదై
త్యుని నెటుపోరునం గెలచితో! పరికింపగ దోచదయ్యెడిన్॥

బల—సోదరా! మాధవా! యీనీచునివాగ్ధోరణికంతు లేదనికొని యెదను.

కృ—(కోపముతో) ఓరీ కద్వాదశిరోమణీ! రుక్మి!

మ॥ వసధింబుక్కిటబట్టవచ్చు; రవిబింబంబున్ పడింమ్రింగవ
చ్చును, కాలాహిముఖంబు నందిడగవచ్చుం గాలు, కాలాగ్నియై
మనవచ్చున్, దినవచ్చు ఘోరవిషమున్ మత్సగంధమందానిమ
ద్ఘనచక్రాహతి బారితప్పుకొన మూర్ఖా! నీ కసాధ్యంబురా!॥

బల—ఓరీ శాస్త్రవాధమప్రథమా,

తే॥ ముసలమున నీదుమెడవంచి మున్నపర్వ
తాళిపయి జంభభేది దంభోళివోది
గతగరుత్తుల జేసిన గతిని నీదు
శిరము ధారుణి ద్రెళ్ళవేసెదను గదను॥

రుక్మి—ఓహో అన్నదమ్ములకిర్వురకొక్కసారియే ప్రతాపమెక్కి కనులుగప్పినట్లున్నదే— (ఎగతాళితో) కృష్ణా! ఏమిది యుద్ధభూమి యనుకొంటివా— లేక— బృందయనుకొంటివా:—

సీ॥ పరికించిచూడంగ ద్వారకాపురిగాదు ఘనభయంకర సంయుగంబుగాని
పడవన్నుటకుచిన్న పాతబండ్లునుగావు చేవగల్గినరథశ్రేణిగాని
సరసోక్తులాడ నాసారసాక్షులుగారు బలులుధీరులు వీరభటులుగాని
బాగుగావినగ సంభాస్వనంబులుగావు దంతిప్రకరబృంహితములుగాని

సీత్కృతంబులుగావు విశేషమత్త
తురగసంచయహేషానికరముగాని
వంశనాదంబుగాదతి పటహాభేరి
భాంకృతులుగాని గోపాలబవరమేల॥

యాదవా!

క॥ ఖండంబై కాలానల
కాండంబై శాత్రవజనగర్వహారణమై
మండివడు వహ్నిశరము
ద్దండగతిఁ వచ్చెనీదు తనువోముకొరా॥ (అని బాణమువదలును.)

కృష్ణు—ఓరీ!

క॥ వడగండ్లు రాల జలజల
దడదడఘనగర్జనవితతంబులునిండన్
వడికరితుండము ధారయు
వడ బర్జన్యాస్త్రమిదిగొ వచ్చెపై బడన్॥ (బాణమువదలును.)

రుక్మి—(తనలో) ఆహాయేమీ పర్జన్యాస్త్రమహాత్మ్యము. జగంబంతే నంధకారబంధురంబుగా జేసినది. (ప్ర) (కోపముతో) ఓరీ యదుకులాంభోధి బడబానలా!

క॥ నీకంధరశస్త్రంబును
నీకాయమురూపుమాప నిఖిలసుభువనా
నీక భయంకరవాయు
వ్యాకాండంబిదె ప్రయోగపరచితిగనుమా॥

కృష్ణు—ఓరీ దేవానాంప్రియా!

మ॥ పరిపంథీనుత దృప్తజాల కితవా ప్రాజ్ఞాధమా క్రూర పా
మరపాపీఖలధూర్త వంచకమతీ మందా నికృష్టాత్మ దు
ష్కర కార్యాకృతకోవిదా తవమరుత్కాండంబు ఛేదింపగా
నురునాగాస్త్రము నేతు గాచికొనుమా యుద్దీప్తవత్యద్దీప్తవమ్మున్॥
(బాణమువదలును)

రుక్మి—(తనలో) కట్టా! నాదివ్యాస్త్రములన్నియు వృథయైపోయినవి. ఇప్పుడుద్ధరవడి, నిప్పులగ్రక్కుచు, జనుదెంచుచున్న పన్నగాస్త్రమునకు గరుడాస్త్రముచే నుపసంహారంబుగావించి, యికదివ్యాస్త్రములప్రయోగించక బాణములచేనొప్పించెద. (ప్రకాశముగా) ఓరీ కృష్ణా! యిదిగో గరుడాస్త్రముచే నుపసంహరించితిని—(ఎగతాళిగా)

తే॥ బకక్రొక్కెరజంపుటో ఫణిపడచుటో
చిన్నమొక్కలగూల్చుటో వెన్నదొంగి
లించుటోయని యెంచితే పంచశాజి
మచ్చరానలమున బడి మరలిచనుట॥

కృ—ఓరీ పరిపంథి! దుర్గుణగంధీ!

మ॥ ఘన యుద్ధంబుల నెన్నొచూచితిని మత్కాక్ష్వేయ ధారాహతిం
జనినారెందరొ స్వఃపురంబునకు నీచా! నీవె శూరుండవం
చును, బల్కాతలగూయుచుంటివి రణక్ష్మోణీతలంబందునె
వ్వనిముంగ గెల్చితో నీభుజాబలముచే వానిం బ్రశంసింపరా॥

రుక్మి—ఓరీ! నవనీతతస్కరా! అవును నీవన్నట్లు నీవే చాలయుద్ధంబుల జూచితివి, చేసితివి, నిజము ధర్మమే లక్ష్యముగాగొన్న మేము నీవలె యధర్మరణము లెట్లొనరింపగలము! అదిగాక—నీవు నీచ జన్మంబులకైనా పాల్పడుదువు. అందర ట్లామోదింతురా!

కృ—శా॥ ఓరీ ద్రోహి మదీయబాణముల నిన్నుర్వింబడంగూల్చెదన్
ఘోరాజిన్ గడుసాయమున్ సలుప నీకుం దోడుగా స్థాణు వృ
(క్షారుల్ నిల్చిన నిల్తు) గాక యకటా కొండంతదుఃఖంబుతో
నూరన్ నీతలిదండ్రు లేమయెదరో యూజింపరా దుర్మతీ!॥

రుక్మి—ఛీ! క్షాత్రవచనంబులకు బదులుగా విప్రవచనంబు లుగ్గడించుచున్నావు. "రాచబిడ్డకు మరణంబు రణమునందు" అను నార్యోక్తి యెరుంగవా! సంగరమున నెందరినో తెగటార్చి వీరస్వర్గము జూరగొన్న రాచబిడ్డకై తల్లిదండ్రులు శోకింతురా!

మ॥ ధనుఘోరం గెలువంగలేక మరినా నానాస్త్రశస్త్రాళిహా తిఁ
దనువెల్లం బహురంధ్రముల్పడగ చేతంబందు జీవంబుపై
ననుమానంబుదయింప శాస్త్రవచనార్థంబేగధర్మంబులం
చును, జ్ఞానావళియందు బందుగుల మంచుఁ బ్రోద్దునుంబుచ్చెదే॥

తెరలో

తే॥ రాజభీష్మకపుత్రు మమ్మాజడుండు
యుద్ధవుడు బట్టికొట్టుచు యుద్ధభూమి
పారదోలుచునుండెను బ్రతుకమికను
మమ్మురక్షింప నీదెభారమ్ము సుమ్ము॥

రుక్మి—(విని పరికించి) సైనికులారా! భయపడకుడు, సాళ్వవిదూరకులారా! మీారింకను చూచెదరేమి! వారలకు సహాయపడుడు.

బల—సోదరా! రుక్మి ప్రళయకాల రుద్రునివలె మండిపడుచున్నాడు. కావున జాగ్రతగా నుండుము. నే నాదెస మనభటానీకమునకు దోడు పడెదను.

(నిష్క్రమించును.)

కృ—ఓరీ రుక్మి! నీవంటి యమర్యాదకున కింత దయ జూపించరాదు. కనుక యిదుగో! వాడి ములికిగాచుకొనుము. (బాణము వేసి రుక్మిచేతి బాణములు విరుగగొట్టును)

రుక్మి—ఏరాదుర్మతీ! జరాసంధునికోడి యిరువదియొక్కమారు పారిన పారుబోతువని యందరెరుగని సంగతికాదు. ఇప్పుడు బాణముల తుత్తునియలు చేసినను—వీరుడవని పేరు రాబోదు, ఇదుగో—నిన్నేమిచేయుదునో చూడుము.

కృ—నీచా! నీకారులు కట్టిపెట్టుము. ఇదియే యర్ధచంద్రబాణము.

(అని బాణములవదల రథాంగములు, రథికుడునుగ్నుమాచగును)

రుక్మి—(తనలో) అయ్యో, దైవమా! యింతకోపమేల! అవును-జయాపజయంబులు దైవాధీనంబులుగదా! (కోపముతో) ఓరీ యాదవ కులపాంసనా! రథాంగములను, రథికునిజంపితివా, యెంత యధర్మ

యుద్ధము జేయుచుంటివి-నీపొగరడంచెద నుండుము. (మీాసము దువ్వును)

కృ—ఓరీ తుచ్ఛా! నీడాబులు నీమిత్రులగు జరాసంధాదులవద్ద జూపి కొని సంతోషించుము. నాయెడ జూపకుము. ఇదే మరియొక్క-బాణము సంధించుచున్నాడ కాచుకొనుము (బాణము వేయును).

రుక్మి—(రధమునుండిదూకి తనలో) అయ్యో రధమంతయు పిండిపిండి యైనదే! ఇక నేనెచ్చటనుండియుద్ధము చేయుదును. పారిపోవుదునా, (నిదానించి) ఛీ పారిపోయిన సరివారునగరా! (కోపముతో) ఓరీ తుచ్ఛా! రధరధికరధాంగబాణములు తునియలైన పారిపోవుదు నని యట్లుగావించితివేమో! కాని-ప్రాణములు పోయువరకు నిన్ను వదలిపెట్టనుసుమా! (అని గదతీసికొని) ఇదుగో-గద జూచి తివా! యిక గదాయుద్ధమునకురమ్ము.

తెరలో.

క॥ అయ్యో బలరాముడు మ
మ్మియ్యెడజక్కాడె ధైర్యమినుమంతయు లే
దయ్యో రక్షించను రా
వయ్యా మీాభృత్యజనులమయ్యా కరుణన్॥

రుక్మి—(బిగ్గరగా)

ఆ॥వె॥ అనుగులార మీారలందరకుడీ భయ
మున నివేసహాయమువడ మీాకు
బంపుచున్నవాడ భటులనిప్పుడు కొంద
రిని రయంబుగల్గు ఘనజయంబు॥

(నడచుచు గదద్రిప్పుచు) ఓరీచోరా, రమ్ము. చేవగలాడవేని గదాయుద్ధంబున కూనుము. లేనిచో నాచెల్లెలినివదలి నీదారి నీవు పొమ్ము. (ఉలికిపడి) ఏమిది-యీాయార్తధ్వని!

తెరలో.

ఓ రుక్మిమహారాజా, రక్షింపుము. రక్షింపుము. సాత్యకి మమ్మందరి బరిమార్చుచున్నాడు. మాశరీరములు చిల్లులుబడి సూర్యరశ్మి వెలువడు

చున్నది. కొందరు కాళ్లుదెగియు మరికొందరు చేతులుదెగియు యింక కొందరు మొండెములై మొఱ్ఱో దేవుడాయని యల్లాడుచున్నారు.

రుక్మి—(ఒకప్రక్కజూచి) అక్కటా,

క॥ రణవీరులె యిచ్చట మ
రణమొందిరి యపజయంబు రానున్నది కా
రణమిట్టులుండ కృష్ణుడు
రణవీరుడటంచు జగతిరాజులు నిజమా॥

ఓ సైనికులారా, యిదుగోవచ్చెదనుగాని ధైర్యంబూనుడు. వీర పరాక్రమంబుజూపి జయముగాంచుడు. (కృష్ణునిజూచి) మానవాధమా, గదాయుద్ధమునకురమ్ము.

కృ—(గద్రదిప్పుచు)

తే॥ ధరణి దేవకీదేవి నందనుడ నేని
కరుణ క్షోణీసురల బ్రీతిగాచెదేని
సాధువరదుడననుట నిజంబయేని
నీకు బరాభవమును జేతు నిశ్చయముగ॥

(అని రుక్మి తలక్రిందికివంచి గదనెత్తును.)

రుక్మి—(తనలో) కట్టా—చచ్చితి చచ్చితి.

రుక్మిణి—(తొందరగా కృష్ణుడెత్తిన చేయిపట్టుకొని) హేకృష్ణా! రక్షింపుము రక్షింపుము.

తే॥ జగములనుసృష్టిజేసి పోషణమొనర్చి
హీనులనడంచు నో పరమేశ్వరుండ
నీవటంచునుమదియందు నెంచబోక
యిటుల తప్పొనరించె బ్రాణేశ బ్రోవు.

(అంజలిఘటించి) హేపరమదయానిధీ! —ఈతండెంత క్రూరుండైనను నీకు బావమరందియగునుగనుక—నామీదప్రేమనుంచి యైనను మాయన్నను రక్షింపుము.

రుక్మి—(తనలో) అమ్మయ్య తోడబుట్టినందునకు బ్రతికించినది. అంతియచాలును.

కృ—(గదదించి) మానినీ! భయపడకుము. నీయన్న కేమి హానిజే యను (రుక్మిభుజముపై చేయివైచి యెగతాళిగా)

ఉ॥ ఓవసుధాధిపా! మనకు నూరకయేతగు వేల! రుక్మిణీ
దేవిని నేవరించగొని తీవ్రగతింజనుచున్న వాడ! నా
బావమరందివైతివి కృపామతినైతిని నిన్నుజంప మా
తో వసిరమ్ము ద్వారక—కుతూహలమొప్పగడించ రుక్మిణీ.

బావా! నీకంటెనాకు చుట్టమెవండు! రమ్ము (అనిమీసములు గడ్డములుగొరుగును)

బల—(ప్రవేశించి) తమ్ముడా! ప్రాణముదీయుటకన్న నవమానము జేయుట మిక్కిలి ఘోరమైనది. ఏలననగా-బుద్బుదప్రాయములగు శరీరంబులెప్పుడైనగతించును గాని—ఈయవమాన మాచంద్రార్కముగా నిలువంబడును.

కృ—(చిరునగవుతో) నిజము.

రుక్మి—(తనలో) కటకటా నేనీ సమరంబునకేలవచ్చితిని వచ్చినందులకు క్షౌరమాయెనుగదా! —యికతిన్నగా నిక్కడనుండి జారుకున్నది మేలు! (అనితలవంచుకొని మెల్లగాబోవును.)

బల—రుక్మిణీ! నీయన్నకు పరాభవముజరిగినదని తలపోయకుము. నా సోదరుడు మహానుభావుడు నీకెట్టి కష్టమునులేదు. సంతోషవంతురాలవుగమ్ము.

రుక్మిణి—సరిలెండు—నామనోహరు సుందర పాదారవిందంబు లానంద ముతో నర్చింపుచుండు నాకెక్కడిదుఃఖము!

బల—సోదరా! నీవే నారాయణుండవు నీలీలదెలిసికొన నిర్జరాళులకైన నసాధ్యంబు. ఇంకనాబోటి వాడొకలెక్కయా(కరములుమోడ్చి)

తే॥ జగమనెడినాటకంబును సల్పుసూత్ర
ధారివీవ! కౌస్తుభమణిధారివీవ!
దైత్యవిధ్వంసకుడవీవ! ధర్మరక్ష
తత్పరుడవీవ! యావరాత్పరుడవీవ! ॥

కృ—అన్నా! మనమాటలసందడిలో తిన్నగా రుక్మిజారుకున్నట్లున్న దే?

మనపురంబిచ్చటికి చాలాదూరమున్నది గనుక తొందరగా నేగు దమురమ్ము. (నిష్క్రమింతురు.)

2 వ రంగము.

రుక్మి—(ప్రవేశించి) అక్కటా ! దైవమా కట్టకడకు నన్నెంతహీను నిగా జేసితివి.

తే॥ క్షత్రియాన్వయమందున జననమంది
సకలశస్త్రకలాపము సంగ్రహించి
యధికవీరుడనంచును యశముగాంచి
నట్టి నాకవమానంబు కట్ట ! కలిగె॥

(దుఃఖముతో) అయ్యో! యేమిది! మనంబంతయు, చీకాకుబడినది. హారుక్మిణీ ! హారుక్మిణీ ! నీయన్నకెంత యవమానంబుజేయింతివి ! ఇంత వరకు నిన్నుదీసుకొనివచ్చెదనని ధైర్యమూనెడి తల్లితండ్రుల లేజాడవినిన నెంత దురపిల్లుదురోగదా! ఓసీగయ్యాళిదానా ! ఓసోదరహంతకీ! నీవెంత యైననుజేయగలవే ! ఈసంగతియే నాకిదివరకే తెలిసియేయుండిన నిన్ను జంపి మాకుల గౌరవము గాపాడికొనెడివాడను. కానిముందాలోచన లేక వెఱ్ఱినైతిని (ఆశ్చర్యముతో) అబ్బా!— వాసుదేవుని పరాక్రమ మద్వితీయము.

తే॥ శరమొకటి చేత రథికుపీచంబడంచి
కడు నిశితబాణమున రథాంగముల నడచి
వేగ నొక కోల వరదంబు పిండి చేసి
యెనిమిది శరంబులను మేననింపె తూట్లు॥

(ఆలోచించి) అవును రుక్మిణియొద్ద మాత్రమేమి తప్పున్నది. బాల్యమునుండియు కృష్ణుని తప్ప నింకెరిని వరించనని చెప్పుచున్నదిగదా ఎంతజెప్పినను, కఠినాత్ముడనై వినక శిశుపాలున కీయదలంచుటచే రుక్మిణి తన్ను వరించుట నాలించి, వాసుదేవుడు రాక్షసవివాహమున గొనిపోవు చున్నాడు. నిజము కృష్ణునియొద్ద మాత్రమేమిదోసమున్నది (ఆలోచించి) బాల్యవివాహములకన్న స్వాయంవరములే శ్రేష్ఠమనిగదా మనువు నుడివి వది. నేను రుక్మిణి కోరినటులొనర్చక, యేల పాపాత్ముడనైతి. (కోపము

తో తలనూచుచు) ఓరీ యాదవాధమా! నన్నవమానమొనర్చితివని గర్వము జెందకుము. వీరభటానీకముగూర్చికొని నీపురంబుముట్టడించి... నిన్ను నీసోదరునిజంపి, యాచంద్రార్కమ్మగు యశంబుగొనెదగాక (దిగులుతో) కటకటా!...మీసములేని యీపాడు మొగముతో నేనెట్టుల నావారి జూచెదను. రాజ్యమేలాగు నేలెదను!! స్నేహితుల కేరీతి తిలకింతును!! (పండ్లుగొఱుకుచు) కామాంధా! దుర్మతీ! సమయము తప్పిపోయినది. పొమ్ము ఇత్తరిని నామిత్రులేయుండిన నొక్కడునైన నినుగదలనిత్తుమా! (కోంచెమాగి) ఇస్సీ—వారలు నాకంటె ముందుగనే యీతని దాడికి నిల్వలేకపోయిరిగదా! కానిమ్ము గతజలసేతుబంధన మెందులకు! ఏవల్లకునైన నింతటితోజేరి వాసుదేవునిసమరక్షోణీతలంబున జయించుటకై ఘోరతపంబొనర్చెద, మత్పురంబునకు బోనొల్లనను మిమచేత గడ్డము మీసములు వచ్చినదాక నెటులనో జీవించి యటుపిమ్మట విదర్భ జేరెదగాక!

(అని నిష్క్రమించును.)

## 3 రంగము.

### ద్వారకాపురి మార్గము.

(బలరాముడు, కృష్ణుడు, రుక్మిప్రవేశము)

కృ—అన్నా! మన నగరంబిచ్చటి కనతిదూరమునన్నది. కనుక నీవ్వుముందుగా జని పురంబంతయు నలంకరించ సేవకుల నియోగించుము.

సీ॥ మాళవ నేపాళ చోళ కాశ్మీరాంధ్ర లాట, వరాట కరాటొరిస్స
హాస్తినాపురము మధ్యవరగణము గుజరాతి బెంగాలు కర్ణాట, కుంత
లాయోధ్యమద్ర బీహారు కళింగాంగ వంగద్రవిడ సింధు బర్బరయును
కర్నాట పంజాబి కన్నడ ఘూర్జర మగధ మహారాష్ట్ర మహిపతులకు
లలిలిఖించియు మీరు జాబులను రేపు
నాడు కళ్యాణమంచు ఘనంబుగాను
బంపుడీ యంతలోపలవత్తుమన్న
శ్రితజనావన! యగ్రజా! సీరపాణి!

బల—సోదర ! నీవు చెప్పినట్లేయొనర్చెదను. మీరు త్వరగాజనుదెంచుడు నేనేగివచ్చెద. (అని నిష్క్రమించును.)

కృ—(రుక్మిణిని కౌగలించుకొని) రుక్మిణీ ! యొక్కముద్దిమ్మ.

(అని ముద్దిడికొనును)

రుక్మి—(సిగ్గుతో తలవాల్చి తనలో) ఆహా!

సీ॥ ఏమహామహుఁడు సత్త్వమయశోదకు వదనమందున విష్టపములజూపె
నేపూతచారిత్రుఁ డా పూతకీ స్తన శ్రీరమ్మలందాప్రివి చెలగిచంపె
నేవసుధాధీశుఁడా వజ్రి గర్వంబుబాప గిరిని యెత్తె బాల్యమునన
నేకరుణాసింధుఁడా కంసు గడతేర్చి, సద్యశోకన్యను సంగ్రహించె
నట్టి నావల్లభుండు మహానుభావు
డరిజనావళిహారుడు మందరధరుండు
నాదుపుణ్యంబుచేత నామోదమునను
కౌగిలించెను, నాజన్మ గాంచె ఫలము॥

ఇంతకాలమునుండి యేనే దివ్య సుందరపురుషునకై దీక్షబూనియుంటినో- యట్టి వాసుదేవుని, నిప్పటికిగదా, నాథునిగా బడయగల్గితిని.

కృ—ప్రేయసీ, మీయన్నకు మానభంగము కల్గెనని చింతిల్లకుము.

రుక్మిణి—నాథా, యాచింత నాకెంతమాత్రము లేదు.

సీ॥ పూర్ణిమాచంద్రుని బోలుమీానెమ్మోము,గనులపండువుగాగ గాంచి గాంచి
యఖిలమానవులకర్ణామృతంబైన పిల్లనగ్రోవినాదంబు వినియువినియు
నగశిరంబున నటనంబొనర్చిన నీదు జిరుపదంబులు సేవజేసిచేసి
భక్తిపూరితములై భవహరంబులగు నీపాటల నెన్ని యోపాడిపాడి
లాలితంబుగ రతులందు దేలిదేలి
నాదు దైవంబుగానిన్నె నమ్మినమ్మి
మీాదు కౌగిళ్ళయందున మెలగి మెలగి
కొనుచునుండెడి నాకింక కొదువె సుఖము॥

కృ—(చిరునగవుతో) కాంతా, ప్రేమాన్వితవగు నిన్ను నాకిల్లాలుగా గూర్చినందులకు, భగవంతునికి పదివేల వందనము లర్పించు

చున్నాను. (పరికించి) కలికీ! యీసముద్రతీర మెంత మనోహరమో చూడుము.

తే॥ కాంత! కన్గొంటివే దాని గన్నులలర
గగనచుంబిత కల్లోల కాండజనిత
భయదమోంకార నిస్వన వ్రతతి రత్న
ఝషతిమింగల నికరంబు సాగరంబు॥

శంకరు—(ప్రవేశించును)

రుక్మిణీ—కృష్ణులు—(నిర్వేరపాటుతో) శంకరా! వందన సహస్రములు.

శంక—పుత్రపౌత్రాభివృద్ధిరస్తు. కృష్ణా! నీవు మహానుభావుడవు. దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై యవతరించిన నారాయణుండవు. ఈమె మహాలక్ష్మీస్వరూపురాలు. నన్ననవరతంబు భజించు నాభక్తురాలు. సుగుణాలలామ. నిన్నత్యంత ప్రేమంబున ప్రేమించినందులకు దురాత్ముల ద్రుణీకరించి రాక్షసవివాహమున గొనిపోవుచుంటివి. ఇందులకు పరమసంతోషము. రుక్మిణీ కృష్ణులారా! మీ యీప్సితంబుల నుడువుడు. తీర్చెదను.

కృ—శంకరా! భరతఖండంబు నాశీర్వదించుట మాత్రమే,

శం—అట్లయిన నవధరింపుడు.

సీ॥ వైదర్భిబోలెడి భామాశిరోమణు లింటింటియం దుదయింతురుగాక
వాసుదేవుని పదపంకజంబులెగతి స్థిరనటంచెద దలంచెదరుగాక
పాపాత్ములౌరుక్మి వంటిదుర్మార్గ జనేశులు వే,నశియింతురుగాక
సతతంబుహరికథాశ్రవణంబుచెజనులు మ్మదముతో మోక్షమందెదరుగాక
తంత్రములులేక నృపులు పాలింతురుగాక
పతియెగతియని సతులు గొలుతురుగాక
కవులకెల్లను పదశుద్ధి గలుగుగాక
భరతఖండంబు కీర్తిని బడయుగాక॥

కృ—తథ్యము.

సమాప్తము.

